# గాలిబ్

## (ఏరి కూర్చినగజల్లు)

* * *

సంకలనం

శ్రీ రషీద్ ఖురేషి

అనువాదం

శ్రీ డి. మదనమోహనరావు

సంపాదకుడు

శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి

**PRICE : Rs. 3-00**

# అనుక్రమణిక

—o—



★

# పరిచయం

గాలిబ్‌కవిని తెలుగువారికి పరిచయంచేయవలెనన్న ఉద్దేశం కొత్తదేమీ కాదు.

గాలిబ్ కవిని ప్రేమించేవారిలో డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అగ్రగణ్యులు. గాలిబ్ కవి తమకు గురుతుల్యులని గోపాలరెడ్డిగారు తమ ప్రేమాభిమానాలను ప్రకటిస్తుంటారు. గాలిబ్ కవిత్వం. ప్రణయకవిత్వం అసలు గజల్ అంటేనే సుందరీమణులతో, మదిరాక్షులతో ముచ్చటించడం అన్నమాట. గాలిబ్ కవి తన ప్రేమను. ప్రణయాన్ని వర్ణించిన తీరు అత్యంతరణీయము. రసవంతము; అందుచేతనే కాబోలు ఆయన కవిత్వములోని ప్రియుడుగూడ మనకు యెంతో అందంగా, యెన్నోసొగసులతో కనిపిస్తాడు. ప్రేమించేవాని ప్రేమగూడ వరిస్తుందని ప్రతీతి!

గాలిబ్ కవి వర్ధంతి శతవార్షికోత్సవము సందర్భాన ఆయన కవిత్వాన్ని తెలుగులోనికి అనువదించవలెనను అభిప్రాయాన్ని గోపాలరెడ్డిగారు వెలిబుచ్చినారు. గాలిబ్ కవి గీతాలనుండి కొన్నింటిని యెన్నుకొని వాటిని తెలుగులో వ్రాసి, ఆగీతాల భావాలను వివరించవలెనని నిర్ణయము జరిగినది. ఈ విధంగా, గాలిబ్ కవిని ఆయన యధార్థమైన రూపంలో తెలుగు పాఠకుల ముందు సాక్షాత్కరింప జేయడానికి అవకాశం ఉంటుందని గట్టినమ్మకం. ప్రబలమైన ఆశ. తద్వారా రసజ్ఞులు ఆయన కవిత్వాన్ని ఆస్వాదించి అనుభూతిని పొందగలరు. గాలిబ్ కవితోద్యానవనవాటిక నుండి కొన్ని పూవులను ఏరి కూర్చెడి గురుతర బాధ్యతనునాకు అప్పగించినారు.

గాలిబ్ కవిని అర్థం చేసుకోవడం చాలకష్టం. అర్థం చేయించడం అంతకన్నా కష్టం, గాలిబ్ గీతాలను ఆస్వాదించి అనుభూతిని యెవరికి వారు

పొందవలసినదే. ఈ అనుభూతిని వ్యక్తంచేయడం అసాధ్యం గాలిబ్ గీతా లలో కొన్నింటిని నేను ఎంపిక చేసినాను.

ఇది కవితాపిపాసతో, సాహిత్యాభిలాషతో చేసిన యత్నం. మా ప్రయత్న ఫలం ఒక ఆ కృతిని ధరించి మీ ముందున్నది. మా యీ ప్రయత్నం ఎంత వరకు విజయవంతమైనదో నిర్ణయించవలసినది మీరే.

తెలుగు వారికి గాలిబ్ భావాలను, అభిప్రాయాలను తెలియచేయడానికే మా యీ ప్రయత్నం ఉర్దూ కవితా విహాయసంలో జేగీయమానంగా వెలిగిన ఇతర ప్రసిద్ధకవుల భావాలను ఇదేవిధంగా అందజేయాలని మేమభిలషిస్తు న్నాము. ఉర్దూకవుల భావప్రపంచం వర్ణనారీతి తెలుగు కవికులకు భిన్న మైనవి. పారసీ కవితా కాంతులలో ఉర్దూ కవిత తన రూపురేఖలు దిద్దుకొన్నది కాని ఆలోచనలు, మనోరూపాలు, రెండూ భాషల్లో సమానంగానే కనిస్తాయి. ఉర్దూ కవితలో భావశబలతను, రసానుభూతిని అర్థంచేసుకోగలగడం తెలుగు కవికేమంతకష్టమైన పనికాదు. కాని ఉరుదూ కవుల ప్రయోగాలు, కథన రీతులు తెలుగు కవితోద్యానంలో నూత్నప్రసూనాలై పరిమళిస్తాయి. క్రొత్త దివ్వెలై వెలుగులు చిమ్ముతాయి ఇది సంభవమే:

గాలిబ్ కవిత్వానికి తెలుగు పాఠక లోకంలో పరిచయాన్ని, ప్రాచు ర్యాన్ని, ప్రోత్సాహాన్ని కలుగజేస్తున్నందుకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అనేక విధాల ప్రశంస నీయమైనది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ఆద రణలో, రక్షణలో ఉర్దూ సాహిత్యము, ఉర్దూ సాహిత్యప్రియులు సురక్షి తంగా ఉండగలుగుతున్నారు.

రషీద్ ఖురేషీ

# ఆకాంక్ష

మహాకవి గాలిబ్ దీవాన్ (కవితాసంకలనం)లోని కొన్ని గజళ్లను, కొన్ని పాదాలను ఏరి, సరళమైన తెలుగు అనువాదంతో కూర్చబడిన సంపుటి ఇది. ప్రతి పాదానికి సంఖ్యవేసి ఆ పాదాన్ని ముందు ఉర్దూలిపిలోను, పిదప తెలుగులిపిలోను చూపినాము. మొత్త గజల్, పాదం పూర్తి అయిన తరువాత సంఖ్యను అనుసంచి అనువాదాన్ని ప్రతిపాదించి ఉన్నాము.

ఉర్దూ భాషలో ఎందరో మహాకవులు తమ దీవాన్లను ప్రకటించారు. కాని ఎవరి రచనలకుగాని (షరహాలు) వ్యాఖ్యానాలు వెలువడలేదు. ఒక్క గాలిబ్ కవితలకు ఇంచుమించు పదామూడు వ్యాఖ్యానాలు వెలసినవి. ఈ వ్యాఖ్యాతలలో కొందరు శబ్దార్థాలను మాత్రం వివరించారు. మరికొందరు తమకు తోచిన రీతిని అర్థ వివరణం చేశారు. అయినా గాలిబ్ కవితలోని అర్ద్రితను, గూఢతను, భావశబలతను అందుకోలేక పోయారని రసజ్ఞుల అభిప్రాయం. ఉర్దూలో ఉద్దండులకే అర్థంకాని కొన్ని పట్టులున్నాయి గాలిబ్ కవితలలో, సమకాలీన ప్రజాజీవితవృత్తాన్ని వ్యగ్యంగా చిత్రించిన ఘట్టాలున్నాయి, వైయక్తిక జీవితసమస్యలకు సంబంధించిన తలపోతలున్నవి. ఈ అంశాలను అవగాహనచేసుకుని వ్రాయబడిన 'సంజీవనీవ్యాఖ్య' ఒక్కటి కూడా వెలువడలేదు. సమకాలీనపండితులవిమర్శలకు గురి అయినవి గాలిబ్ రచనలు, ఉర్దూకవితలో భావవిప్లవానికి వేగు చుక్కగా వెలిగినాడు గాలిబ్. శాబ్దికమైన చమత్కారాలకు, పాండితీప్రకర్షకు, కవిసమయా

లకు, వ్యక్తిగత ప్రశంసాధిక్షేపాలకు, మత ప్రచారానికీ బలిఅవుతూ సహజత్వాన్ని, సజీవత్వాన్ని కోలుపోతూఉన్న ఉర్దూకవితలో మనోవేదనను ఆర్ద్రతను, భావపుష్టిని, వ్యంగ్యవైభవాన్ని ప్రవేశపెట్టి, కవితోద్యమానికి నూతన లక్ష్యాన్ని, నూతనదృక్పథాన్ని ప్రసాదించగలగాడు. తనకంటె పూర్వుడైన మీర్ కవి ఈ విషయంలో తనకు మార్గదర్శకుడని గాలిబ్ ఒక చోట చెప్పుకొన్నాడు. ఉర్దూ కవితకు, సరళతను స్వచ్ఛందతను, హార్దికతను ప్రసాదించినవాడు మీర్. జటిల పదగుంఫనంతో దీర్ఘవాక్యాలతో విషయవివరణ శక్తిని కోలుపోతూ ఉన్న ఉర్దూగద్యరచనలకు కొత్త అందాలను చేకూర్చాడు. పొడి పొడి మాటలతో రసవృష్టిచేసి ఉర్దూగద్యరచనలో సరికొత్త ప్రమాణాలను స్థాపించిన మనీషి, భాషావిప్లవకారుడు.

గాలిబ్ కేవలం కవేకాదు, దార్శనికుడు కూడ. జీవితంలోని అమృతాన్ని, హాలాహలాన్ని చవి చూసిన సత్త్వసంపన్నుడు. ఒకరి మెప్పుకోసం అబద్ధాలాడి, ఆత్మవంచన చేసుకుని బ్రతుకనేర్చినవాడుకాడు. మతాతీతమైన సమ్యక్‌జీవనాన్ని ఊహింపగాజాలిన మానవోత్తముడు. ప్రతిభాశాలి. గాలిబ్ కవితతో పరిచయం మానవతావాదంతోనే పరిచయం.

శ్రీ రషీద్‌ఖురేషిగారు వివరించిన వ్యాఖ్యానాలను మననం చేసుకుని తెలుగు పాఠకునికి ఆస్వాదనీయంగా ఉండేపద్ధతిలో ఈ అనుసరణం సాగింది మహాకవి దాశరధి తెలుగువారికి తొలిసారిగా గాలిబ్ కవితామృతాన్ని అందించడానికి ప్రయత్నం చేశారు. 'గాలిబ్ గీతాలు' అనే పేరుతో కొన్ని పాదాలను ఏరుకుని ఛందోబద్ధంగా, సంగీతాత్మకంగా అనువదించి తెలుగువారి అభివందనాలకు పాత్రులుకావడమేకాక ఒక అనుసరణీయమైన సాహితీపథాన్ని చూపెట్టగలిగారు. గాలిబ్‌తో మరింత సాన్నిహిత్యాన్ని కలిగించడానికి మా యీ అనువాదాలు తోడ్పడగలవని ఆశిస్తున్నాము. ఛందఃపరిధిలోనికి కొన్ని భావాలు

రాకపోవచ్చు. అదే రూపంతో రాకవచ్చు. ఒక భాషలోని ఛందోమయమైన కవిత మరో భాషలో ఛందోరూపంతో అవతరించినప్పుడు ఈ అంశం మనకు స్థూలంగా కనిపిస్తుంది. మా యీ ప్రయత్నం గద్యరూపంలో జరుగడానికిదే కారణం. గాలిబ్ భావాలు యథాతథంగా ప్రస్తుతించడానికి యథోచిత ప్రయత్నం చేసినాము. వ్యంగ్యార్థాలను, గాలిబ్ వైయక్తిక జీవితఘట్టాలను అక్కడక్కడ వివరించడానికి యత్నించాము. మన తెలుగులోకంటె భిన్నమైన కవితా సామగ్రి ఉర్దూలోఉన్నది. ఆయా భావాలను ఇతర కవులు ప్రకటించిన తీరునుకూడా కొన్ని సందర్భాల్లో చూపినాము. ఈ అనువాదం గాలిబ్ కవితా సౌందర్యాన్ని, భావనాపటిమను తెలుగువారికి సాక్షాత్కరింపజేయ గలిగితే మా కృషి ఫలించినట్లేనని మా ఆకాంక్ష.

ఇరివెంటి కృష్ణమూర్తి
సంపాదకుడు



# గాలిబ్ జీవితం కవిత్వం

మిర్జా అసదుల్లాఖాన్ గాలిబ్ 1797 వ సంవత్సరం డిసెంబర్ 27 వ తేదీన ఆగ్రాపట్టణంలో జన్మించినాడు. అప్పుడు, అచ్చట ఒక కవి జన్మించినాడని. ఆయన కీర్తి ప్రఖ్యాతులు ఆ రోజును ఒక శుభసందర్భంగా, ఒక చరిత్రాత్మకదినంగా పరిగణింప జేయగలవని ఆనాడు యెవరూ ఊహించలేదు. ప్రతిభ, ప్రజ్ఞగలవారికి శిక్షణ యివ్వడానికి రకరకాల పరీక్షలను కల్పించడం. కాలచక్రపు విచిత్రమైన ధోరణి.

గాలిబ్ కవికి గూడ ఇటువంటి పరీక్షలే ఎదురయినవి. అయిదు సంవత్సరాల చిరుతప్రాయంలోనే త్రండి అబ్దుల్లాఖాన్ మరణించినాడు. తండ్రి చల్లని నీడ తొలగిపోయిన తరువాత పినతండ్రి నస్రుల్లాఖాన్‌గారి ప్రేమాభిమానాలకు పాత్రుడైనాడు. తొమ్మిది సంవత్సరాల పసిప్రాయంలోనె యీ మాత్రపు అదృష్టం గూడ దూరమైపోయింది. తొమ్మిది సంవత్సరాల పసివాడు గాలిబ్ ఈ ప్రపంచంలో రక్షణలేనివాడై పోయినాడు వృద్ధుడైన తాత గులాం హుసేన్‌ఖాన్ కంపించే చేతులతో గాలిబ్‌ను తన ఒడిలోనికి చేర్చుకున్నాడు.

గాలిబ్ సూక్ష్మగ్రాహి. తెలివిగలవాడు, విద్యాభ్యాసం పట్ల అపరిమితమైన ఆసక్తి ఉన్నవాడు. మొట్ట మొదట షేక్ మొఅజ్జమ్ అనే ఒకతని వద్ద గాలిబ్ విద్యాభ్యాసం ప్రారంభమయింది. షేక్ మొఅజ్జం తరువాత అబ్దుల్ సమద్ అనునతడు గాలిబ్‌కు ఫార్సీభాష నేర్పినాడు. ఫార్సీ భాషలోని గొప్పదనాన్ని, అందులోని రామణీయకతను చక్కగా అర్థం కావించినందుకు గాలిబ్ అబ్దుల్ సమద్‌కు జీవితాంతం కృతజ్ఞుడుగా ఉండేవాడు. ఈ ప్రాథమిక శిక్షణ ఫలితంగా, గాలిబ్ కవిలో గర్భితమై ఉన్న కవితా వాహినిపొంగి ప్రవహించ

సారంభించింది. చిన్న తనంలోనె గాలిబ్ వివాహబంధంలో చిక్కుకొని పోయినాడు. ఈవిషయాన్ని గురించి ఆయన ఒకచోట ఈవిధంగా అన్నాడు.

"ఉద్నేన పాయెఫేకె గిరిఫ్తార్ హమ్ హువే"

అంత మాత్రాన అతను కేవలం బంధనంలోనే ఉండిపోలేదు. ఆ తరువాత గూడ ఆయన విశృంఖల వాతావరణంలో విహరిస్తూనే ఉన్నాడు.

ఢిల్లీలోని ఒక నవాబుకూతురును వివాహమాడినప్పుడు ఆయన వయస్సు పదిహేడు సంవత్సరాలు. మౌలానా అల్తాఫ్‌హుసేన్ హాలీ గాలిబ్‌ను చూచి వయస్సులో ఉన్నప్పుడు పట్టణంలోగల వారందరిలోను గాలిబ్ చాల అందమైనవాడని. వృద్ధాప్యంలోగూడ ఆయన అందంగానె ఉండేవాడని అన్నాడు. గాలిబ్ కవి ఢిల్లీలో యాభై సంవత్సరాలున్నాడు. ఢిల్లీలో ఒక ఇంటిని కట్టుకొనవలేనన్న ఆలోచన అతనికి ఎప్పుడూరాలేదు కట్టుకొవడమే గాకుండా కొనుక్కొనవలెనన్న ప్రయత్నం గూనా చేయలేదు అతడు బ్రతికి ఉన్నన్ని రోజులు అద్దె ఇండ్లలోనే ఉన్నాడు పుస్తకము. విషయంలో గూడా ఇంతే. అతనెప్పుడు గూడా పుస్తకాలను కొనేవాడుగాడు. ఎప్పుడు యేపుస్తకము అవసరమైతే దానిని తెప్పించుకొని తిరిగి పంపించేవాడు. గోడలు, ద్వారములులేని గృహాన్ని నిర్మించుకొనవలెనని, తను వ్రాసిన కవిత్వంలో గాలిబ్ కవి అభిలాషను వెల్లడిచేసినాడు. ఇటువంటి గృహానికి కాపలావాండ్రుగాని, ఇరుగుపొరుగువారుగాని ఉండగూడదని ఆయన అభిప్రాయం. ప్రపంచంలో తాను ఒక అతిధిగామాత్రమే ఉంటున్నానను కొనేవాడు గాలిబ్ కవి. ఇటువంటివారికి మరి గృహాన్ని నిర్మించుకొనవలెనన్న ఆలోచనే రాదుగదా! ఎదో ఒక తీరుగా గడుపుకొని వెళ్లి పోతారువీరు. ఆ పైన పుస్తకాలకు సంబంధించిన విషయం. గాలిబ్ కవికి అతని పరిజ్ఞానం పైన సంపూర్ణమైన నమ్మకం ఉండెడిది. తనను పుస్తకాలన్నింటికీ అతీతంగా భావించేవాడు. తనకు కావలసిన పరిజ్ఞానాన్ని, సహిత్యాన్ని అతను తనలోపలనే దాగియున్న విజ్ఞానం నుండి గ్రహించేవాడు. చదువవలెనన్న కోరిక జనించినప్పుడు, తానే ఒక పుస్తకాన్ని వ్రాసి చదువుకునే వారికోవకు చెందినవాడు

గాలిబ్ కవి. చిన్నాయన నస్రుల్లాబేగ్ మరణానంతరం అతనికివచ్చే పింఛన్ను ప్రభుత్వం వారు గాలిబ్ కవి పేర మంజూరు చేయడం జరిగింది. అతిస్వల్పమైన యీ పింఛన్‌తో ఇంటి ఖర్చులను దాటించడం కష్టతరమై పోయింది. కలకత్తావెళ్లి ఈ పింఛన్ను కొంత యెక్కువ చేయించుకొనవలె నన్న ప్రయత్నం ఫలించలేదు. ఈ పరిస్థితులలో లఖ్నోసంస్థానం నుండి వాజిదలీషాగారు గాలిబ్ కవికి సంవత్సరానికి 500 రూపాయలను ఇవ్వడా నికి నిర్ణయించిరి. దురదృష్టవశాత్తు నిర్ణయం జరిగిన రెండు సంవత్సరాల తరువాత లఖ్నోసంస్థానం రద్దుగావించబడుతుంది. ఇంతటితో గాలిబ్ కవికి వచ్చే వేతనం గూడా ఆగిపోయింది. జీవితంలో వచ్చిన ఇబ్బందులనన్నింటిని గూడా ధైర్యంగా, మందహాసంతోనే యెదుర్కొన్నాడు అతను. పరిస్థితులు అతనికి రకరకాల యిబ్బందులను కలిగించినవి. వీటన్నింటిని ఆయన విక సితవదనంతోనే స్వీకరించినాడు_ఒకప్పుడు కవనం చెప్పుతూ, మరొకప్పుడు చమత్కారాలను చేస్తూ.

గాలిబ్ కవి చమత్కారాలు చాలా ప్రసిద్ధిచెందినవి. ఇటువంటివి కొన్ని ఈ క్రిందపొందుపరచనైనవి. అతను చాలా ధైర్యం గలవాడని అన్యాయా లన్నింటిని పరిహాసం చేస్తూ ధైర్యంగా యెదుర్కొనేవాడని ఈ సంఘ టనలు రుజువు చేస్తాయి.

1. చలికాలంలో, ఒకరోజు చిలకపంజరమొకటి అతని ముందుండెను. చలి బాగా ఉండటంవలన చిలక తన ముక్కును ముడుచుకొని కూర్చుండి యుండెనట. కవి చిలుకతో అంటాడు ''ఏమిటే రామచిలకా, పిల్లిజెల్ల యెవ్వరూలేరు గదా నీకు, మరినీ కెందుకు యీ చింత'' అని.

2. గాలిబ్ కవికి మదిరను సేవించడం అలవాటు, పైసల ఇబ్బంది వలన ఒక రోజు త్రాగలేకపోయినాడు, నమాజయినా చదువుదామని మసీదుకు వెళ్లతాడు. మసీదు మెట్లను ఎక్కుతుండగా, శిష్యుడొకతను భయపడుతూ కవిచేతికి సారా సీసాను అందించాడు. సీసా చేతికందిన తరువాత మసీదు నుంచి మళ్లిపోతుంటే, మధ్యలో ఒకతను '' ఏమండి, నమాజ్

చదువకుండానే వెళ్లుతున్నారేమిటి'' అని అడగగా ''దేనికొరకైతే నేను నమాజు చదువుతానో అది నాకు లభించింది. మరి ఇంకెందుకు నమాజు చదవడం'' అని సమాధానం చెప్పి వెళ్లిపోయాడు కవి.

3. ఒక సారి గాలిబ్ కవి, ఉండటానికి ఒక అద్దె ఇంటిని చూడటానికవి పోతాడు. ఇల్లు అతనికి నచ్చుతుంది. కాని అతని భార్య అంటుంది ''ఇల్లు బాగానేఉంది. కాని అందులో దయ్యాలు బాగాఉన్నా యట. ఏవిధంగా అందులో ఉండేది'' అని. అందుకుగాలిబ్ సమాధానం ఇస్తాడు "బేగం! నీవు ఆ ఇంట్లో ప్రవేశించిన తరువాత, దయ్యాలేవీ అందులో ఉండటానికి సాహసించవులే'' అని.

గృహానికి సంబంధించినంతవరకు ఇతని జీవితము ప్రశాంతమైనదే. అతనికి తన భార్యతోగల అభిప్రాయభేదంగూడా కవితారంగంలో అతనికి గల పేరుప్రఖ్యాతులను అర్పించేసుకోలేనంతవరకే. గాలిబ్‌కవి భార్య ఒక సాధారణమైన గృహిణిమాత్రమే. హంగులనుగాని, అలంకారాలనుగాని యెరుగని అతివ ఆమె. గాలిబ్ కవిత్వంలో ప్రతిబింబించే విషాదాలన్ని అతని గార్హస్థ్య జీవితానికి ప్రతిరూపాలు మాత్రమేనని కొందరి అపోహ. ఇందులో ఎంతమాత్రం యథార్థంలేదు ఇవి కేవలం కవి గొప్ప తనం మాత్రమే. ఇతను తన కవిత్వంలో ప్రస్ఫుటింపజేసిన విషయాలన్నీ ఊహాకల్పితాలు మాత్రమే. గాలిబ్‌కవి భార్య మిక్కిలి సనాతనమైన, ధార్మిక స్త్రీ. అయినప్పటికీ, మదిర త్రాగవద్దని భర్తనుయెప్పుడూ వారించలేదు ఆమె. వంటమాత్రం ఆమె, ఇరువురికి వేరుగానే చేసేది.

గాలిబ్‌కవి తన అదృష్టాన్నే యెప్పుడు నిందించుకునేవాడు. ఒకరి తరువాత మరొకరుగా పిల్లలమరణం, ఎంతో ప్రియుడైన అల్లునిమరణం, తక్కువ వేతనం, యెక్కువ ఖర్చులు. డబ్బు పట్ల అలక్ష్యం, తిరుగుబాట్లవలన కలిగిన నష్టాలు, ప్రేయసి మరణం, జబ్బులు, రోగాలు. ఇటువంటి విషాదసంఘటలన్నిగూడా, పారవశ్యంకావలెనని కోరుకునే ఒక కవిని ఏవిధంగా

కోయకోనివ్వగలవు?! ఇటువంటి పరిస్థితులలో అతను యేవిధంగా కవిత్వం రాయగలడు? కవిత్వం అటుంచి అసలు యేవిధంగా జీవించగలడు?

అయినప్పటికి వీటన్నింటిని తట్టుకొని జీవించగలిగినాడతను. జీవించడమేకాదు, జీవిస్తూ, చక్కని కవిత్వాన్ని సృష్టించినాడు దుఃఖంతో నిండుకొని ఉన్న ఒక గజల్ (గీతము) వంటిది అతని జీవితము. ఇన్ని ఇబ్బందులు అతని కలగడంవలన ఒక్క మేలు మాత్రం తప్పకుండా జరిగింది. తన కవిత్వంలో ఆయన తన రక్తాన్నంతా ఇమిడ్చి ప్రపంచముందుంచినాడు. ఈ కారణంగానే గాలిబ్‌కవి కవిత్వం భూతలంపై చిరస్థాయిగానిలిచి ఉండగలదు. ఇతని కవిత్వంలో పదాల పొందికయే గాకుండా, సజీవమైన ఆలోచనలు ఉన్నవి. ఈ ఆలోచనలలో మనం అతని హృదయావేదనను, దానిగమనాన్ని స్పష్టంగాచూచి, అనుభూతిని పొందవచ్చును

గాలిబ్‌కవిత్వాన్ని అర్థంచేసుకోవడానికి, ఆయన కవిత్వంలోగల ప్రత్యేకతలను తెలుసికోవడం చాలా అవసరం. ఇదివరకు చెప్పినట్టుగా గాలిబ్‌పై పార్సీభాషాప్రభావం చాలా ఉన్నది. ఇతను పార్సీభాషలో కవిత్వం గూడా వ్రాసినాడు. తాను ఉర్దూకవిత్వం వ్రాయడం కేవలం తనను సంరక్షించుకోవడానికి మాత్రమేనని ఆయన అనుకుంటూఉండేవాడు. అతనికి లభించిన ఉర్దూ కవిత్వవాతావరణం పార్సీభాషనుండి దొరికినదే. మహాఫిల్ (సమావేశము), దీపము, పతంగములు, తోటలు, బుల్‌బుల్, పూవులు, గూడు (ఆషియానా) పానము, మదిరాభాండాలు చషకాలు సాఖీ, ఉషస్సమీరములు, ఇవన్నీ ఇతని కవిత్వానికి వాతావరణం. ప్రేయసి, ప్రత్యర్థి, ప్రబోధకులు, మిత్రులు, మూతలు, అందులోని పాత్రలు. విరహము, ప్రణయము, సమాగమము, ఈర్ష్య, కోపము, ఇవి ఇతని కవిత్వమునందలి అనుభూతులు. జీవితానికి సంబంధించిన వేదాంతము, ప్రేమలోని స్థాయి, ఆముష్మికచింతన (తసవ్వుఫ్) మొదలైనవి ఇతని కవిత్వానికి ఇతివృత్తాలు. మన దేశంలోని కవిత్వంలో ఈ లక్షణాలు కనిపించవు. పై విషయాలన్నింటితో కవికి పరిచయం లేనప్పటికి, వీటన్నింటితో అతనికి సంబంధం ఉండటం మూలాన, వీటన్నింటిని తెలిసికొని అను

భూతిని పొందటానికి ప్రయత్నిస్తాడు. వీటి ప్రత్యేకతలు తెలియనప్పటికి వానిని అర్థంచేసుకోవటానికి ప్రయత్నించినాడు. గులాబీ పుష్పంలో తన ప్రేయసి ముఖాన్ని చూస్తాడు. పానసేవతో ప్రేమలోని విషాను అనుభవిస్తాడు. ప్రేయసిని గురించి వాపోయేటప్పుడు ఆకాశం పైపునకు చూస్తూవెత జెందుతాడు.

కవి చివరిరోజులు మాత్రం చాలా విషాదంగా. గడిచినవి. లేచి తిరగ లేకపోయేవాడు. యెక్కువగా మంచంపైననే పండుకొని ఉండేవాడు. ఈ స్థితిలోగూడా ఉత్తరాలకు మాత్రం సమాధానాలను తప్పకుండా వ్రాయి స్తుండేవాడు. ఒక ఉత్తరానికి సమాధానం వ్రాస్తూ ''నాపరిస్థితిని గురించినన్ను అడగవలసిందేమీలేదు, ఒక్కటి, రెండు రోజులలో ఇరుగు, పొరుగువారే చెప్పగలరు'' అని వ్రాయించినాడు. చనిపోయేముందు అతడు ఎప్పుడు ఈ పంక్తులను చదివేవాడు.

"దమె వాపసీం బర్ సరే రాహ్ హై
అజీజో అబ్ అల్లాహీ అల్లాహ్ హై''

శిశువు జన్మించిగానే శ్వాస లోనికి ప్రవేశిస్తుంది. చనిపోయేటప్పుడు తిరిగి ఇదేశ్వాస బయటికివస్తుంది. దీనినే తిరిగిపోయేశ్వాస (దమె వాపసీం) అంటారు దీని అర్థం ఇప్పుడింక చివరిశ్వాస వెళ్లిపోనున్నది'' అని. ఆ పైన గాలిబ్ ఉండబోడు. కేవలం భగవంతుడు మాత్రమే ఉండగలడు.

1869, 15 ఫిబ్రవరి రోజున తిరిగిపోయే ఆ శ్వాస గాలిబ్‌కవి భౌతిక దేహాన్ని వదిలివెళ్లిపోయింది. హజ్రత్ నిజాముద్దీన్‌గారి సమాధి ఆవరణలో ఇతని దేహంసమాధిగావించబడినది. గాలిబ్‌కవి కవిత్వంలో అతని ఉఛ్వాస నిశ్వాసలు మాత్రం, శాశ్వతంగా ఇమిడి పోయినవి. అతని గీతాలు మాత్రం అన్ని కాలాలలోను, వానిలో ఇమిడియున్న అమరమైన ఈ శ్వాసల ఆధా రంగా, యెల్లప్పటికి సజీవంగా, సస్యశ్యామలంగా ఉండగలవు.

రషీద్ ఖురేషి

# గాలిబ్ గౌరవార్థం

[ఉస్మానియా విశ్వవిద్యాలయ మహిళా కళాశాల అధ్వర్యాన దర్బార్ హాలులో 1953 మార్చి 3 వ తేదీన గాలిబ్ దినోత్సవం జరిగింది. ఈ సందర్భాన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకెడెమీ అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు ఉర్దూ భాషలో ఉపన్యసించారు. ఉర్దూభాషకు గణనీయమైన ఉన్నతిని, ప్రశంసనీయమైన ప్రోత్సాహాన్ని కల్గించుతున్న హైదరాబాద్ నగర వాతావరణంలో ఇది గోపాలరెడ్డిగారి మూడవ ఉర్దూ ఉపన్యాసం. తెలుగులో వెలువడుతున్న యీ గాలిబ్ కవితా సంకలనానికి గోపాలరెడ్డిగారి ఉపన్యాసం విశేషమైన వన్నెను, శోభను చేకూర్చ గలదని చెప్పవచ్చు.]

మహిళామణులారా!

మహాశయులారా!

సౌందర్యవిలసితమైన యీ సమావేశాన్ని యేర్పాటుజేసి మహిళా కళాశాల ఉర్దూసంఘం వారు గాలిబ్‌కవిని గౌరవింపుచున్నందుకు నాకు అపరిమితమైన ఆనందం కలుగుతున్నది. ఈ సమావేశాన్నిచాల చక్కగా, సముచితంగా యేర్పాటుజేసినారు. ఈ శుభసందర్భాన నన్నుగూడ రావింపజేసినారు. ఇది యెంతో ముదావహం. సాహితీ ప్రియులందరికి యీ సమావేశం సంతోష కారణం. రమణీయమైన యీ సాహిత్యసమావేశపు ఉత్సవానికి అధ్యక్షత వహించే అవకాశం నాకు లభ్యంకావడం నేనొక సత్కారంగా, గౌరవంగా, మీ సహృదయత్వానికి సాక్ష్యంగా భావిస్తున్నాను. నమ్రంగా నా కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాను.

ఉర్దూసాహిత్య ప్రపంచంలో పరోక్షంగా, ఏకలవ్యఫణితిలో, నాకు మొట్టమొదటి గురువు గాలిబ్ కవీశ్వరుడు. ఒక అనిర్వచనీయమైన, ఆనం

డాతిరేకమైన అనుభూతిని పొందుతూ నేను ఆ మహాకవి గీతాలను ఎంతో శ్రద్ధతో చదువుతుంటాను; ఎంతో ఆసక్తితో నాలో నేను ఆలాపిస్తుంటాను.

మణిమకుటాలు, మహారాజ్యాలు లేనప్పటికి మహాకవులు మహారాజులే; ప్రజల హృదయపీఠాలే వారి మయూరసింహాసనాలు; ప్రజలమేధామండలాలే వారి మహాసామ్రాజ్యాలు. ప్రజల భావోద్వేగాలతో, ఆలోచనలతో, ఆవేశాలతో, ఆకాంక్షలతో వారు ప్రభావితులౌతారు. ఆ ప్రభావాన్ని తమ కవితాస్రవంతిలో అంతర్లీనంగా ప్రవహింపజేసుకొని ప్రజల జీవితములో, సామాజిక సభ్యతలో వారు అంతర్భాగంగా చేరిపోతారు వారి సంజ్ఞలమేర, వారి సంకేతాల ఛాయలో ఆలోచనలు ఆవిర్భవించి అభివృద్ధిచెందడం సంభవిస్తుంది. మనము ఏవిషయాన్ని స్వల్పమైనదిగా, భావించుతామో అదివారి కవితాదృష్టిలో అసాధారణమైన ప్రత్యేకతను, సమధికమైన సౌందర్యాన్ని సంతరించుకుంటుంది.

జిగర్ కవి చెప్పినట్లు,

హస్తీ జిసే కహతే హైఁ ఎక్‌సాదా హఖీఖత్ హై
రంగీన్ నిగాహోఁనే రంగీన్ బనాడాలీ—

(ఈసృష్టి ఒక సాధారణమైన యథార్థము. దివ్యమైన దృష్టి ఈసృష్టిని శోభాయమానము గావించుతుంది.)

ఇట్టి రమణీయమైన దృష్టి కవులను మాత్రమే ఉంటుంది. ఇదే గాలిబ్ కవి దృష్టి. సాధారణమైన ఒకవ్యక్తి సజీవ సృష్టిలో ప్రకృతి యెన్ని శోభలను వెదజల్లి యెంత మనోహరముగా భాసించుతున్నదో చూడండి—

“జహాఁ తేరా నక్షె ఖదమ్ దేఖ్తే హైఁ
ఖియాబాఁ ఖియాబాఁ ఇరమ్ దేఖ్తే హైఁ”

మన ప్రజాస్వామ్యంలో రాజులకాలం అంతరించిపోయింది. వారు కేవలం మనస్మృతి పథంలోనే, మసక మసక నీడలుగా, మిగిలిపోయినారు. వారు శాశ్వతంగా నిద్రించుతున్న సమాధులు సైతం సమయసైకతాల క్రింద కూరుకొనిపోయి అదృశ్యం కాగలవు. ఈ రాజులు తమ తమ అదృష్టచక్రాలు

అవిఘ్నంగా తిరిగినప్పుడు ఎన్నెన్నో వ్యవహారాలనుచేసినారు; కొందరు దారుణమైన హత్యాకాండలు గావించినారు; విలాసవిహారాలను సలుపుచు ప్రణయకలాపాలను కొనసాగించినారు. ఎన్నిచేసినా, చిరస్థాయిగా నిలచి పోగల స్మృతి చిహ్నాలను మాత్రము వారు చరిత్రకు అందించలేకపోయినారు. మానవులందరివనె కవులుగూడ కాయాన్ని వదలి యీ ప్రపంచము నుండి వెళ్లిపోక తప్పదు. కాని కవులది కేవలము శారీరకమైన యెడబాటు మాత్రమే. మృత్యువు అనెడి ఒక యవనిక కీర్తిశేషులయిన కవులను మన కన్నులనుండి దాచివేస్తుంది. అయినప్పటికి, వీరు ఆ యవనికల చాటునుండి మనను అన్ని వేళలా కనిపెట్టుకొని ఉంటారు.

జనవరిలో నేను ఢిల్లీ వెళ్లడం జరిగింది. అప్పుడు నేను గాలిబ్ సమాధిని సందర్శించినాను. గౌరవ సూచకంగా, గాఢమైన అభిమానపురర విరుల అంజలిగా ఆయన రచించిన 'దివాన్'ను పూలతో సమాధిమీద సమర్పింగా పెట్టినాను. ఆసయంలోనేను అక్కడ ఒంటరిగా మాత్రమేలేనని విన్నవించు తున్నాను. నా హృదయం ఆసమయాన గాలిబ్ కవీశ్వరుని పారలౌకిక స్వరూపసాక్షాత్కారంతో అంతులేని ఉత్తేజాన్ని పొందింది. నిర్జీవమైన ఆ నిశ్శబ్ద తలో, యెవరో ఒకవ్యక్తి, గాయపడినవాడు, గాఢమైన నిర్లిప్తతలో ఉన్నవాడు, గాద్గద్యము గళనాళమును ఆవరించి ఉన్నాడు. మెల్లమెల్లగా, ఆగుతూ ఆగుతూ, ఒకప్పుడు స్పష్టంగా, మరొకప్పుడు అస్పష్టంగా మూలుగుతున్నట్లు నాచెవులు విన్నవి, విహ్వలమై నాహృదయము కన్నది.

"గాలిబె ఖస్తాకె బగైర్ కౌనుసె కామ్ బంద్ హైం
రోయియే జార్ జార్ క్యా, కీజియె హాయె హాయె క్యవుం"

గాలిబ్‌కవి గజల్ జగత్తుకు సాటిలేని మేటి పాదుషా వంటివాడు; ఈ సామ్రాజ్యంలో ఆయన యెంతో ఠీవిగా పరిపాలన సాగించినాడు!! అది మరెవరికీ సాధ్యంకాలేదు, అదిమరెవరికి వశపడలేదు, గాలిబ్‌కవి పద్ధతియే వేరు; ఆయనశైలి, ఆయన కవితా సమర్పణసరణి, ఆయన వర్ణనావిధానము, రీతి అపూర్వమైనవి, అసదృశ

మైనవి–'గాలిబ్ కా హై అందాజె బయాఁ ఔర్' ఈయన కవిత్వములో తాత్విక సమస్యలున్నవి; తనివితీరని. మరులుగొలిపెడి, ముగ్ధము కావించెడి ప్రణయ ప్రస్తావనలున్నవి. జీవితపుకఠినయథార్థములు స్ఫటికములవలె స్పష్టమై పువ్వొ డులను పంచిపెడుతున్నవి యీయన కవిత్వములో. వీటన్నింటిని ఆయన మనకు అందించిన రీతి తరితీపులున్నట్టిది, మధురమైనది, మనోరం జకమైనది.

తాత్వికచింతనకు సంబంధించిన అమృతమును అందించెడి ఒక మచ్చుతునకను రుచి చూడండి–

''ఏక్ హంగామె పె మవుఖూఫ్ హై ఘర్ కీరౌనక్
నౌహయె గమ్ హి సహీనగ్మయె షాదీన సహీ''

మరొక మచ్చుతునక మానినక ఉన్మాదాన్ని వివరిస్తున్నది–ఇది పరిశీలించండి

''వాయె దీవానగియెషౌఖ్ కె హర్ దమ్ ముఝ్ కో
ఆప్ జానా ఉధర్ ఔర్ ఆప్ హి హైరాఁ హోనా''

జీవింతలోని ఒక యథార్థాన్ని గాలిబ్ ఈ విధంగా వర్ణిస్తున్నాడు.

''రంజ్ సే ఖూగర్ హువా ఇన్సాఁ తొ మిట్ జాతా హై రంజ్
ముష్కిలేఁ ఇత్నీ పడీ ముఝ్ పర్ కె ఆసాఁ హోగయీఁ''

ఎంతో హృద్యమైనది యీ వర్ణన:

గాలిబ్ కవి శబ్దశాసనుడు గూడ. ఆయన వాడే పదాలు యెన్నడూ వాడిపోనివి; అవి లలిత లలితమైనవి, సుభగసుందరమైనవి. ఆయన కవిత్వ ములోని భావాలతోపాటు పదాలుసైతం శ్రవణపేయంగా ఉండడంవలన ఆయన కవిత్వమంటే అందరికియెంతో యిష్టం. పఠించేవాడైనా, ఆయన కవితాఖండికల్ని తనకు తెలియకుండానే పాడడం పారంభిస్తాడు–

దిలే నాదాఁ తుఝే హువా క్యా హై
ఆఖిర్ ఇస్ దర్ద్ కీ దవా క్యా హై''

గాలిబ్ కవిలో చిలిపితనం గూడ ఉన్నది: అయితే అందులోను హుందాతనం, ఔన్నత్యం ఉన్నవి.

"బహారాహుఁ మైఁతో చాహియే దూనా హో ఇల్తెఫాత్
సున్తానహీఁ హుఁ బాత్ ముకర్రర్ కహే బగైర్"

ఆయన కవిత్వంలోని నైశిత్యాన్ని, సూక్ష్మదృష్టిని, అపారమైనలోతులను, అందచందాలను, సొగసులను, సోయగాలను, గొప్పదనాన్ని పూర్ణంగా అర్థంచేసుకొనగల యోగ్యత నాకు లేదు. అయితే ఆయన కవిత్వంలోని అమూల్యమైన సౌరభాలను ఆఘ్రాణించి రసాస్వాదన చేయగల శక్తి నాకున్నది; ఆయన గొప్పదనాన్ని, ఔన్నత్యాన్ని నా హృదయం అవలీలగా గుర్తించగలదు, ఆ అనుభూతిని పొందగలదు. ఆ సమనోజ్ఞమైన వాతావరణాన్ని ఆవిష్కరించుకొనగలదు: అందుకు నేను గర్వపడుతున్నాను. అందువలన గాలిబ్ కవి స్మృత్యర్థంగా, నా ప్రేమాభిమానాలకు చిహ్నంగా, చంద్రునికొక నూలుపోగువలె నేను సమర్పించుకొనగల గొప్పకానుక ఒక్కటే-అది నా హృదయం.

1 بسکہ دشوار ہے ہر کام کا آساں ہونا
آدمی کو بھی میسر نہیں انساں ہونا

బస్కె దుష్వార్ హై హర్ కామ్‌కా ఆసాఁ హోనా
ఆద్మీకోభీ మొయస్సర్ నహీఁ ఇన్సాఁ హోనా

2 گر یہ چاہے ہے خرابی میرے کاشانہ کی
در و دیوار سے ٹپکے ہے بیاباں ہونا

గిర్య చాహేహై ఖరాబీ మేరే కాషానేకీ
దరొ దీవార్‌సె టప్కే హై బయాబాఁ హోనా.

3 وائے دیوانگیٔ شوق کہ ہر دم مجھ کو
آپ جانا ادھر اور آپ ہی حیراں ہونا

వాయె దీవానగీయె షౌఖ్‌కె హర్ దమ్ ముఝ్కొ
ఆప్ జానా ఉధర్ ఔర్ ఆప్‌హీ హైరాఁ హోనా.

4 لے گئے خاک میں ہم داغ تمنائے نشاط
تو ہو اور آپ بصد رنگ گلستاں ہونا

లేగయే ఖాక్‌మెఁ హమ్ దాగె తమన్నాయె నిషాత్
తో హో ఔర్ ఆప్ బసద్‌రంగ్ గులిస్తాఁ హోనా.

5 کی میرے قتل کے بعد اس نے جفا سے توبہ
ہائے اس زود پشیماں کا پشیماں ہونا

కీ మెరే ఖత్ల్‌కెబాద్ ఉస్నెజఫాసె తౌబా
హాయ్ ఉస్ జూదేపషేమాఁకా పషేమాఁ హోనా.

6 حیف اس چار گرہ کپڑے کی قسمت غالب
جسکی قسمت میں ہو عاشق کا گریباں ہونا

హైఫ్ ఇస్‌చార్ గిరహ్ కప్డేకి ఖిస్మత్ గాలిబ్
జిస్‌కి ఖిస్మత్ మెఁ హో ఆషిఖ్‌కా గరేబాఁ హోనా.

## 2

1. జగత్తులో సులభంగా కనపడుతున్న ఏ పనీ సులభమైంది కాదు. మనిషే మానవుడుగా రూపొందలేడు. మానవతామర్యాదలనందుకోవడం మనిషికే కష్టసాధ్యం.

2. నేను విరహబాధను అనుభవిస్తున్నాను. ఈ ఎడతెగని శోకంవల్ల జాలువారుతున్న అశ్రుధారాపరంపరలతో నా యిల్లు కూలిపోయేట్టుంది.

3. నాకు తెలియకుండానే నా కాళ్లు నన్ను ప్రేయసి వీధి వైపువు లాగుకొని పోతున్నాయి. వీధిలోనికి పోయిన తరువాత "ఇక్కడికెలారా గలిగాను? చాల ఆశర్యంగా ఉందే". అనిపిస్తుంది. అయ్యో! ఏమిటి ప్రేమోన్మాదం?

4. ప్రియసీ! నీతో సంతోషంగా హాయిగా జీవితం గడపాలన్న నా కోరిక ఎన్నడూ ఫలించలేదు. నా గుండెలో ఆ తీరని కోరిక అట్లా ఉండగానే నేను చచ్చి మట్టిలో కలిసిపోయాను. సరే! నేను లేకపోయినా నీ జీవితంలో ఎల్లప్పుడూ వసంతాలే ఉండనీ. పుష్పశోభలలో విలసిల్లుతూ సంతోషంగా ఉండు.

5. నా ప్రేయసి నన్ను హత్యచేసింది. నేనసువులు బాసిన పిదప పశ్చాత్తప్తురాలైంది. నిష్ప్రయోజనమైందికదా ఈ పశ్చాత్తాపం? పోయిన వాడెలాగూ రాడు.

6. ఉర్దూ కవితలలో ప్రేమ ఉన్మాదంగా పరిణమించినప్పుడు ప్రేమికుడు చొక్కాలను చింపుకోవడం పరిపాటి. ఉర్దూ సాహిత్యంలో శృంగార కవితలో ప్రేమికుని ముఖ్యలక్షణం.

గాలిబ్ చొక్కాగా రూపొందిన ఈ నాలుగంగుళాల గుడ్డ ఎంత దురదృష్టానికి నోచుకుందోకదా! ఇదెప్పటికి చిరిగి చిరిగి పేలికలై పోతూనే ఉంటుంది.

1

درد منت کشِ دوا نہ ہوا
میں نہ اچھا ہوا برا نہ ہوا
దర్ద్ మిన్నత్ కషెదవా న హువా
మైఁ న అచ్ఛాహువా బురా న హువా

2

ہم کہاں قسمت آزمانے جائیں
جب تو ہی خنجر آزما نہ ہوا
హమ్ కహాఁ ఖిస్మత్ అజ్మానే జాయేఁ
జబ్ తూహీ ఖంజర్ అజ్మా నహువా

3

کتنے شیریں ہیں اسکے لب کہ رقیب
گالیاں کھا کے بے مزہ نہ ہوا
కిత్నె షీరీఁ హైఁ ఇస్కెలబ్ కె రఖీబ్
గాలియాఁ ఖాకె బేమజా న హువా

4

ہے خبر گرم ان کے آنے کی
آج ہی گھر میں بوریا نہ ہوا
హైఖబర్ గర్మ్ ఉన్కె ఆనేకీ
ఆజ్ హీ ఘర్ మెఁ బోరియా నహువా.

5

کیا وہ نمرود کی خدائی تھی
بندگی میں میرا بھلا نہ ہوا
క్యావొ నమ్రూద్ కి ఖుదాయీ థీ
బందగీ మెఁ మెరా భలా న హువా

6

جان دی دی ہوئی اسی کی تھی
حق تو یہ ہے کہ حق ادا نہ ہوا
జాఁదీ దీ హుయీ ఉసికీ థీ
హక్ తో యె హైకె హక్ అదా న హువా

7

زخم گر دب گیا لہو نہ تھما
کام گر رک گیا روا نہ ہوا

జఖమ్ గర్ దబ్ గయా లహూన థమా
కామ్ గర్ రుక్ గయా రవానహువా

8

کچھ تو پڑھئے کہ لوگ کہتے ہیں
آج غالب غزل سرا نہ ہوా

కుఛ్ తో పఢియేకె లోగ్ కహ్తే హైఁ
అజ్ గాలిబ్ గజల్ సరాన హువా.



1 నా బాధ ఔషధంసమకూర్చగిలిగే ఉపకారాన్ని పొందలేక పోయింది. మంచిదే అయింది. ఆకృతజ్ఞతాభారం కూడా ఎందుకు?

2 నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నాకు ప్రణయభిక్ష పెట్టు. నాకు ప్రేమను ప్రసాదించు. నీవల్లనైరాశ్యం పొంది ఎక్కడికి వెళ్లను?

3 నీ అధరములెంత మధురమైనవో కదా! నీవు తిట్టినా, దూషించినా మధురంగానే ఉన్నది. కనుకనే ఆ ప్రత్యర్థి నీ ప్రణయాన్ని పొందలేక పోయినా నీ దూషణలతణ్ణి విముఖుణ్ణి చెయ్యలేక పోయినవి. విరక్తుణ్ణి చేయ్యలేకపోయినవి. ఎంత సిగ్గుమాలినవాడతడు?

ఇక్కడ ప్రత్యర్థి అంటే ఆమెనే ప్రేమించే మరో ప్రేమికుడు. ఈ ప్రేమికుల ఈర్ష్యాసూయలవర్ణనలు ఉర్దూ శృంగారకవితలో చోటు చేసుకున్నవి.

4 ప్రేమికుని నిస్సహాయతను, దారిద్ర్యాన్ని, బాధను వ్యక్తపరచే పంక్తులివి. ఆమెకోసం ఎంతోకాలం నిరీక్షిస్తాడు. ఆమెరాదు. చివరకు తానే పోయి ప్రార్థేయపడ్తాడు. అంగీకరిస్తుంది. ఇంటికే వస్తానంటుంది. నగరమంతా ఆమె తన ఇంటికి వస్తూందన్నవార్త పొక్కిపోయింది. అప్పటికి కవి గారి పరిస్థితి మరింత చెడిపోయి ఉంటుంది. ఆమెకోసం అతడప్పటికే తన సర్వస్వం కొల్లగొట్టుకున్నాడు విన్న మొన్నటి దాకా ఒక చాపైనా ఉండేది. ఆమె వచ్చేరోజు ఇది. కాని ఈ రోజు ఆచాపకూడా లేకుండా పోయింది.

ఇదే భావాన్ని రవీంద్ర కవీంద్రుడు "సంజవేళ. ఆమె వచ్చేవేళ, వెలిగించడానికి దీపమైన లేని నా ఇంటిలోనికి ఎలా తీసికొని పోగలను?

ప్రఖ్యాత ఉర్దూకవి 'జోష్‌కు' కూడా తన ఇంట్లో ఏమీలేదన్న సంగతి తెలిసివస్తుంది. ఎప్పుడు? ఆమె ఇంటికి వచ్చిన తర్వాత.

"అబ్ తక్ న ఖబర్ థీ ముఝె ఉజ్డే హువే ఘర్ కీ
వాహ్ ఆయెతో ఫిర్ బేసరొసామాఁ నజర్ ఆయా"

ఆమె ప్రణయం కోసం నా యిల్లంతా కొల్లగొట్టుకున్నాను. నా గతి ఇట్లా పరిణమించిందని నాకే తెలియదు. ఆమె వచ్చింది. రాగానే నా యీ నిస్సహాయస్థితి అవగతమైందినాకు.

5 నమ్రూద్ అనే రాజు తానే భగవంతుణ్ణని ప్రకటించుకొని దైవశాసనాలకు విరుద్ధంగా వ్యవహరించాడు. అయినా అతడు సర్వసౌఖ్యాలు అనుభవించాడు.

6 భగవంతునికి, భక్తునికి గల సంబంధాన్ని గాలిబ్ వివరిస్తున్నాడు. మానవుడా! నీకత్యంత ప్రియమైన ప్రాణాన్ని అర్పణం చేయడంలో ఏదో గొప్పపనం ఉందని భావిస్తున్నావు. ప్రాణదాతకు మన ప్రాణాలను తిరిగి ఇవ్వడం దానంకానేకాదు. ప్రాణత్యాగానికి పూర్వం సద్ధర్మాచరణం నీవు చేయలేక పోయావు?

7 నా గాయానికి చికిత్స చేయించుకున్నప్పటికీ, రక్తం ప్రవహిస్తూనే ఉన్నది. (ప్రేమించిన హృదయం నిరంతరం బాధపడుతూనే ఉంటుంది) తన పనులన్నీ కాకుండా పోయినవేగాని ఏదీ పూర్తి కాలేదు. ఎవ్వడు సాయపడలేదు. నా జీవితం దైవోపహతమై ఇలాసాగి పోతూ ఉన్నది.

8 గాలిబ్! ఒక కొంతైనా పాడు, నీ కవిత్వం కోసం రసికులు తహతహలాడుతున్నారు. ఈ వేళ గాలిబ్ పాడలేదని వాళ్లు అనుకోవడం బాగుంటుందా?

గాలిబ్ లేని కవిసమ్మేళనం రక్తిగట్టేది కాదట. ఇదిగాలిబ్ సహజసౌందరమైన స్వోత్కర్ష.



1

یہ نہ تھی ہماری قسمت کہ وصال یار ہوتا
اگر اور جیتے رہتے یہی انتظار ہوتا
యెహ్‌నథీ హమారీ ఖిస్మత్‌కె విసాలెయార్ హోతా
అగర్ ఔర్ జీతెరహ్తె యహీ ఇంతెజార్ హోతా

2

تیرے وعدہ پر جیئے ہم تو یہ جان جھوٹ جانا
کہ خوشی سے مر نہ جاتے اگر اعتبار ہوتا
తెరేవాయిదేపర్ జియే హమ్‌తోయె జాన్‌ఝూట్ జానా
కె ఖుషీసె మర్‌నజాతె అగర్ ఏయిత్‌బార్ హోతా.

3

تیری نازکی سے جانا کہ بندھا تھا عہد بودا
کبھی تو نہ توڑ سکتا اگر استوار ہوتا
తెరీ నాజుకీసె జానాకె బంధాథా అహ్‌ద్‌బోదా
కభీతూన తోడ్‌సక్తా అగర్ ఉస్తువార్‌హోతా.

4

کوئی میرے دل سے پوچھے تیرے تیر نیم کش کو
یہ خلش کہاں سے ہوتی جو جگر کے پار ہوتا
కోయి మేరే దిల్‌సె పూఛే తెరే తీరె నీమ్‌కష్‌కో
యె ఖలిష్ కహాఁసెహోతీ జో జిగర్‌కె పార్‌హోతా.

5

یہ کہاں کی دوستی ہے کہ بنے ہیں دوست ناصح
کوئی چارہ ساز ہوتا کوئی غمگسار ہوتا
యెహ్‌కహాఁకి దోస్తీ హైకె బనేహైఁ దోస్త్‌నాసెహ్
కోయీ చారాసాజ్‌హోతా కోయీ గమ్‌గుసార్‌హోతా.

6

رگ سنگ سے ٹپکتا وہ لہو کہ پھر نہ تھمتا
جسے غم سمجھ رہے ہو یہ اگر شرار ہوتا
రగె సంగ్ సెటపక్తా వొహ్ లహూకె ఫిర్‌న థమ్తా
జిసె గమ్ సమఝ్ రహే హోయెహ్ అగర్ షరార్ హోతా.

7 غم اگرچہ جا نگسل ہے پہ کہاں بچیں کہ دل ہے
غمِ عشق گر نہ ہوتا غمِ روز گار ہوتا
గమ్ అగర్చె జాఁగుసల్ హైపె కహాఁబచ్‌పన్‌కె దిల్ హై
గమె ఇష్క్‌గర్ నహోతా గమె రోజ్గార్ హోతా.

8 کہوں کس سے میں کہ کیا ہے شب غم بری بلا ہے
مجھے کیا برا تھا مرنا اگر ایک بار ہوتا
కహూఁకెస్‌సె మైఁకె క్యాహై షబెగమ్ బురీబలా హై
ముఝేక్యా బురాథా మర్నా అగర్ ఏక్బార్ హోతా.

9 ہوئے ہم جو مر کے رسوا ہوئے کیوں نہ غرقِ دریا
نہ کہیں جنازہ اٹھتا نہ کہیں مزار ہوتا
హువే హమ్‌జో మర్‌కె రుస్వాహువె క్యుఁన గర్కె దర్యా
న కహీఁ జనాజా ఉఠ్తానకహీఁ మజార్ హోతా

10 یہ مسائلِ تصوف یہ ترا بیان غالب
تجھے ہم ولی سمجھتے جو نہ بادہ خوار ہوتا
యె మసాయెలె తసవ్వుఫ్ యెతెరా బయాఁ గాలిబ్
తుఝె హమ్‌వలీ సమఝ్తేజొన బాదఖ్వార్ హోతా.



1 ప్రేయసీసమాగమానికి ఈ జీవితంలో నేను నోచుకోలేదు. బ్రతికి ఉన్నంతకాలం ఈలానే జరుగుతుంది. ఇంకా బ్రతికి ఉన్నా ఇలా పరీక్షిస్తూ కాలం గడపవలసిందేకాని ఆమెను కలుసుకోవడం సాధ్యం కానేకాదు. పునర్జన్మలో కూడ ఫలితం శూన్యమే.

2 ప్రేయసి నిర్దాక్షిణ్యభావాన్ని తెలుసుకున్న ప్రేమికుని భావమిది. ఆమె వస్తానని వాగ్దానం చేసింది. వస్తుందనే ఆశతోనే బ్రతికి ఉన్నాను. ఆమె రాలేదు. ఆవాగ్దానం వట్టిబూటకం. సమాగమం లభించదని నాకు బాగా తెలుసు. నేనామెను నమ్మను. ఒక వేళ ఆమె వాగ్దానం మీద నాకు నమ్మకమే ఉంటే, ఆమె వస్తుందనే సంతోషంతోనాకు హఠాన్మరణం సంప్రాప్తించి ఉండేది. ప్రేయసి వాగ్దానం వట్టిమాట అని నాకు తెలుసు. కను కనే ఆమెకోసం నిరీక్షిస్తూ బ్రతికి చస్తున్నాను.

3 ప్రేయసీ! నీ వెంత సుకుమారివో నీవాగ్దానాలు గూడా అంతే కోమలమైనవి. సునాయాసంగా వాగ్దానాలను విచ్ఛిన్నం చేయవచ్చని నీకు తెలుసు. అవి గట్టివే అయితే నీవు వాటిని తెగ్గించలేవని నాకూ తెలుసు.

4 నీ ఓరచూపుతూపు నాగుండెలో కుచ్చుకున్నది. ఆ తూపు వెళ్లిపోయి ఉంటే ( నాకు నీ పరిపూర్ణ ప్రణయం లభించి ఉంటే ) బాగుండేది. గాయంమాసి పోయి ఉండేది. అలాకాక ఆగాయం నన్ను పీడిస్తున్నది. ప్రణయవేదనను అనుభవిస్తున్నాను. ఈ అనుభూతిలో నాకు ఆనందం ఉన్నది.

5 మిత్రులైనవాళ్లు దుఃఖాన్ని పంచుకునే వాళ్లైనా కావాలె. సహాయం చేయగలిగే వాళ్లైనా కావాలె. ఇదెక్కడి స్నేహం? ఏమిటీ తీరు? నా విరహబాధకు సానుతాపాన్ని ప్రకటించడానికి బదులుగా నాకు ఉపదేశాలు చేయడానికి బయలుదేరారు వీరంతా.

6 ప్రణయశోకం రాళ్లల్లో ప్రవేశిస్తే. ఆరాళ్ల నరనరాలు మిణుగురులకు మారుగా రక్తాన్నే చిమ్ముతాయి. అరక్తం ఎన్నటికీ ఆగదు. ప్రేమలోని దుఃఖం ఇంత ప్రభావోపేతము. ఎంతటి దుఃఖాన్నైనా ప్రేమికుడు సహించగలడు,

7 జీవితం దుఃఖమయమే. అని ఒక వేదాంతభావాన్ని తెలుపుతున్నా డిక్కడ.

ఏ దుఃఖమైనా ప్రాణాలనుతోడేస్తుంది. తప్పించుకోవడానికి వీలు లేదు. నాహృదయం ప్రణయదుఃఖంతో కుములిపోతూఉన్నది. ఒక వేళ ఈబాధను దూరంచేసుకున్నా సాంసారికమైన బాధలు. దుఃఖాలు గుండెలో గూడు చేసుకుంటాయి. హృదయాన్ని ప్రశాంతంగా ఉండ నీయవీపరిస్థితులు. అంచేత ఇతర బాధలకు హృదయంలో చోటివ్వడం కంటె ప్రణయబాధలను అనుభవించడం మేలు.

8 శోకతప్తమైన యీవిరహనిశీధం నన్ను ఎంతగానో పీడిస్తున్నది. ఎవ రితో చెప్పను? ఎలా చెప్పను? జీవితంలో ఒకేసారి చావు వస్తుంది కాని. ఆ చావు వచ్చినప్పుడు వెళ్లిపోవడంలో నష్టం లేదు. కాని ప్రేమికుడు అనుక్షణం మృత్యువాత పడుతుంటాడీ విర హనిశీధంలో.

9 నే నిప్పుడీలోకంలో లేను. నా ప్రేమ కలాపాలగురించి. విడ్డూరంగా చెప్పుకుంటున్నారు. అదేదో చేయరానిపని చేశానని ఆడిపోసుకుంటు న్నారు. నేను నదిలో కొట్టుకొనిపోయి ఉంటే నా ఊసే తెలిసేదికాదు. నా శవయాత్ర బయల్దేరేదికాదు. నా సమాధి ఉండేదికాదు. నాసమాధిని చూసినప్పుడల్లా నన్ను గూర్చి అవాకులూచెవాకులూ ప్రేలే అవకాశం ఉండేదికాదు.

10 గాలిబ్! నీకవిత్వంలో ఎన్నోతాత్త్విక విషయాలన్నాయి, నీకథనరీతిలో ఏదో అనూహ్యమైన శక్తిఉంది. ఈ లక్షణాలు ఋషులలో కనిపిస్తాయి. మరి నీవు మధుపానం చేసి ఉండకపోతే నిన్నులోకం ఋషి అనుకొని ఉండేదికదా!

తన గీతం (గజల్)లోని ఈ మక్తా (కవి పేరున్న పద్యపాదం) ను గాలిబ్ బహాద్దుర్‌షా జఫర్‌కు వినిపించాడట. బహాద్దుర్‌షా గాలిబ్‌ను పోషించిన ప్రభువు. కవి, సరసుడు. షా అది "విని త్రాగే అలవాటు నీకు లేకపోయినా నిన్ను ఋషి అని ఎవరూ అనుకోరు" అని అన్నాడట. గాలిబ్ "ప్రభూ! ఇదిమీరు మనఃపూర్వకంగా అంటున్న మాటకాదు. నేను మధుపాయినని తెలిసికూడా మీరు నన్ను ఋషిగానే భావిస్తారు." అన్నాడట.



1

آہ کو چاہیئے ایک عمر اثر ہونے تک
کون جیتا ہے تیرے زلف کے سر ہونے تک
ఆహ్‌కొ చాహియే ఏక్ ఉమ్ర్ అసర్ హోనేతక్
కౌన్ జీతాహై తెరీ జుల్ఫ్‌కె సర్ హోనేతక్

2

دام ہر موج میں ہے حلقۂ صد کام نہنگ
دیکھیں کیا گزرے ہے قطرے پہ گہر ہونے تک
దామ్‌హర్ మౌజ్ మేఁహై హల్ఖయె సద్‌కామ్ నహెఁగ్
దేఖేఁక్యా గుజ్రేహై ఖత్రేపె గౌహర్ హోనేతక్.

3

عاشقی صبر طلب اور تمنا بے تاب
دل کا کیا رنگ کروں خون جگر ہونے تک
ఆషిఖీ సబర్‌తలబ్ ఔర్ తమన్నా బేతాబ్
దిల్‌కా క్యారంగ్ కరూఁ ఖూనెజిగర్ హోనేతక్.

4

ہم نے مانا کہ تغافل نہ کرو گے لیکن
خاک ہو جائینگے ہم تم کو خبر ہونے تک
హమ్‌నె మానాకె తగాఫుల్ న కరోగే లేకిన్
ఖాక్ హో జాఏఁగె హమ్ తుమ్‌కొ ఖబర్ హోనేతక్.

5

پر تو خور سے ہے شبنم کو فنا کی تعلیم
میں بھی ہوں ایک عنایت کی نظر ہونے تک
పర్తువె ఖుర్ సెహై షబ్నమ్‌కొ ఫనాకీ తాలీమ్
మైఁభీహూఁ ఏక్ ఇనాయత్‌కీ నజర్ హోనేతక్.

6

ایک نظر بیش نہیں فرصت ہستی غافل
گرمی بزم ہے ایک رقص شرر ہونے تک

ఏక్ నజర్ బీష్ నహీం, ఫుర్సతె హస్తీ గాఫిల్
గర్మియె బజ్మ్ హై ఏక్ రఖ్సె షరర్ హోనే తక్.

7

غم ہستی کا اسد کس سے ہو جز مرگ علاج
شمع ہر رنگ میں جلتی ہے سحر ہونے تک

గమె హస్తీకా అసద్ కిస్‌సెహో జుజ్‌మర్గ్ ఇలాజ్
షమ హర్ రంగ్ మెం జల్తీ హై సహెర్ హోనే తక్.



1 ప్రణయదుఃఖంలో వెలువడిన నా ఆర్తనాదం ప్రభావోపేతం కావడానికి ఎంతో కాలం కావాలె. నీ కబరీభరం (సమాగమం) లభించే వరకు నేను బ్రతికి ఉండగలనా ?

2 వానచినుకు ముత్యంగా మారుతుంది. కాని ఆ చినుకు యెన్నో ఆపదలను, యెన్నో యిబ్బందులను యెదుర్కొన్న తరువాతకాని ముత్యపుచిప్పలో పడి ముత్యంగా మారదు. సముద్రంలోని అలలను మొసళ్లను, యెన్నింటినో తప్పించుకొనిగదా యీ నీటి బొట్టు ముత్యంగామారేది. మానవుడు యెన్నో యిబ్బందులను యెదుర్కొని యెంతో ధైర్యంతో ముందుకు పోతేనేగాని ఉన్నతమైన స్థానాన్ని అలంకరించలేడు.

3 ప్రేమించి బాధపడటం అన్నది గాలిబ్ కవిత్వంలోని ప్రతి అక్షరంలో కనుపిస్తుంది. "ప్రేమిస్తే ప్రేయసిని పొందడానికి చాల ఓపిక ఉండాలె. కాని నా హృదయం మాత్రం ప్రేయసిని కలుసుకోవడానికి యెంతో ఆందోళనపడుతున్నది. ప్రేయసిని కలుసుకోకుండానే ఆందోళనతో గుండె బ్రద్దలయి నేను చచ్చిపోయేటట్టున్నది. అయినా, చచ్చిపోయే వరకైనా యీ హృదయంలోని ఆందోళనను, ప్రేయసీసందర్శనాభిలాషను యేవిధంగా అణచిపెట్టుకొనేది! ఇది చాల కష్టమైన పని".

4 ప్రేయసి తనను నిర్లక్ష్యం చేయదు అని యీ వాక్యాల్లో గాలిబ్ అంటున్నాడు. ప్రేయసిదయలేనిదని, తనను హత్యచేస్తుందని కొన్నికొన్నిచోట్ల గాలిబ్ వాపోయాడు. మరి యిక్కడనో— "నేను నా ప్రేయసి కోసం యెంతో బాధపడుతున్నాను ఈ విరహం నేను భరించలేను. నా యీ బాధను ఎవరైనా నా ప్రేయసికి తెలిపితే నన్ను తప్పకుండా అనుగ్రహించగలదు; నన్ను నిర్లక్ష్యం చేయదు. కాని యీ విషయం నా ప్రేయసికి తెలిపే వార్వెరూలేరు. ఎవరైనా ఆమెకు తెలియజేయడానికి వెళ్లినా ఆమెకు యీకబురు అందకముందే నేను మట్టిపాలై పోగలను".

5 హిమబిందువు సూర్యకిరణసంస్పర్శతో తన ఉనికిని కోల్పోతుంది. ప్రేయసీ! నీ పలపుచూపొకటినాపై ప్రసరించు. నేను నా సర్వస్వం నీ కోసం అర్పిస్తాను. నా ఉనికినే మరచి పోతాను.

6 ఓ! మానవుడా. ఎందుకీ ఉపేక్షాభావం? జీవితం క్షణభంగురమైంది. రెప్పపాటులో ముగుస్తుంది. ఒక్క మిణుగురు నాట్యం చేసి నమసి పోయి నంత కాలమే ఈ జీవితశోభ.

7 జీవితంలో దుఃఖానికి మృత్యువే పరిష్కారం. రేయంతా దీపం వెలుగుతూ ఉండవలసిందే. ఆరేయిలో ఆనందమున్నా సరే!. విషాదమున్నా సరే. తెల్లవారగానే ఆ దీపం ఆరిపోతుంది. మనిషి కూడా అంతే. చావువచ్చే దాకా అతని కష్టాలు గట్టెక్కవు. సుఖమైనా, దుఃఖమైనావాడు సహించ వలసిందే.



1

عرض نیاز عشق کے قابل نہیں رہا
جس دل پہ ناز تھا مجھے وہ دل نہیں رہا
అర్జె నియాజ్ ఇష్క్ కె ఖాబిల్ నహీఁ రహా
జిస్ దిల్ పెనాజ్ థా ముఝేవో దిల్ నహీఁ రహా,

2

جاتا ہوں داغ حسرت ہستی لئے ہوئے
ہوں شمع کشتہ درخور محفل نہیں رہا
జాతా హూఁ దాగె హస్రతె హస్తీ లియే హువే
హూఁ షమయె కుష్త దర్ ఖూరె మహెఫిల్ నహీఁ రహా

3

مرنے کی اے دل اور ہی تدبیر کر کہ میں
شایاں دست و بازوئے قاتل نہیں رہا
మర్నేకి అయ్‌దిల్ ఔర్ హీ తద్బీర్ కర్ కె మైఁ
షాయానెదస్తొ బాజూయె ఖాతిల్ నహీఁ రహా.

4

گو میں رہا رہین ستمہائے روزگار
لیکن تیرے خیال سے غافل نہیں رہا
గర్ మైఁ రహా రహెఁ సితమ్హాయె రోజ్గార్
లేకిన్ తెరే ఖియాల్ సె గాఫిల్ నహీఁ రహా.

5

بیدار عشق سے نہیں ڈرتا مگر اسد
جس دل پہ ناز تھا مجھے وہ دل نہیں رہا
బేదాదె ఇష్క్ సే నహీఁ డర్తా మగర్ 'అసద్'
జిస్ దిల్ పె నాజ్ థా ముఝే వొహ్ దిల్ నహీఁ రహా.



1 ప్రణయం కోసం నిరంతరం పరితపించే హృదయం నాదని నాకెంతో గర్వంగా ఉండేది. ఇప్పుడాహృదయంలో ప్రణయోపాసనకు శక్తి లేదు, ఆసక్తి కూడా లేదు.

2 నా కోరిక లేవీ తీరలేదు. నేను నిరాశాహతుణ్ణి. ఈ లోకాన్ని విడిచిపోతు న్నాను. ఆరిపోయిన దీపం లాంటి వాణ్ణి. తేజోవిహీనమైన ఈ దీపానికి ఏ గోష్ఠిలో స్థానముంటుంది?.

3 ''నా కోరిక లేవి ఈడేర లేదు. విరహంతో, శోకంలో మునిగి క్షీణించి పోయినాను నేను. నా దగ్గర యిపుడేమున్నది? ఆ హృదయం లేదు. ఆ ఉత్సాహం లేదు. ఇపుడున్నది చావాలన్న కోర్కె ఒక్కటే. ప్రియసి చేతులలో మరణించే అర్హత గూడ యిప్పుడు నాకు లేదు. అన్ని విధాలా క్షీణదశకు వచ్చిన క్షతగాత్రుడను. నేను చావడానికి వేరే యేదైనా మార్గం చూసుకోవల్సిందే!".

4 దైనందిన జీవిత సమస్యలతో నేను తాకట్టు బడిపోయినా నిన్ను మరవ లేను. నేను నీ పట్ల ఉపేక్షాభావాన్ని చూపలేను. నా ప్రణయోత్సేకాన్ని సందేహించకు.

5 అసద్‌కు ప్రణయం అంటే భయం లేదు. కాని ప్రణయం కోసం నిరం తరం పరితపించే హృదయం తనదని అతనికెంతో గర్వంగా ఉండేది. అలాంటి హృదయం ఇప్పుడు తనకు లేనందుకు ప్రణయానికి అవకాశ మేలేదు.

'అసద్' (గాలిబ్ వలె ఇది ఆయనకలం పేరే. గాలిబ్. పూర్తి పేరు మిర్జా అసదుల్లా ఖాన్.)



1 نہ گلِ نغمہ ہوں نہ پردۂ ساز
میں ہوں اپنی شکست کی آواز
నగులె నగ్మ హుఁన పర్దయె సాజ్
మైహుఁ అప్నీ షికస్త్ కీ అవాజ్

2 تو اور آرائشِ خمِ کاکل
میں اور اندیشہ ہائے دور و دراز
తూ ఔర్ ఆరాయిషె ఖమె కాకుల్
మైఁ ఔర్ అందేష హాయె దూరో దరాజ్

3 ہوں گرفتارِ الفتِ صیاد
ورنہ باقی ہے طاقتِ پرواز
హుఁ గిరఫ్తారె ఉల్ఫతె సయ్యాద్
వర్న బాఖీహై తాఖతె పర్వాజ్

4 وہ بھی دن ہو کہ اس ستم گر سے
ناز کھینچوں بجائے حسرتِ ناز
వొహ్ భీ దిన్ హోకె ఇస్ సితమ్ గర్ సె
నాజ్ ఖీంచూఁ బజాయో హసరతె నాజ్

5 نہیں دل میں میرے وہ قطرۂ خون
جس سے مژگاں ہوئی نہ ہو گلباز
నహీఁ దిల్ మెఁ మెరే వొ ఖత్రయె ఖూన్
జిస్ సె మిజ్గాఁ హుంవీ నహో గుల్బాజ్

6 تو ہوا جلوہ گر مبارک ہو
ریزش سجدۂ جبین نیاز

తూ హువా జల్వగర్ ముబారక్ హో
రేజిషె సిజ్దయె జబీనె నియాజ్

7 مجھ کو پوچھا تو کچھ غضب نہ ہوا
میں غریب اور تو غریب نواز

ముఝ్ కో పూఛా తో కుఛ్ గజబ్ న హువా
మైఁ గరీబ్ ఔర్ తూ గరీబ్ నవాజ్

8 اسد اللہ خان تمام ہوا
اے دریغا وہ رند شاہد باز

అసదుల్లా ఖాన్ తమామ్ హువా
అయె దరేఘా వొహ్ రిందె షాహిద్ బాజ్



1 నేను గీతికాప్రసూనాన్ని కాను. తంత్రీమూర్ఛనను కాను. నేను పరాభూతభగ్నమానసుణ్ణి. మనోదర్పణం పగిలిన ధ్వని నావాణి.

2 నీవేమో నీకేశాలంకరణలో నిమగ్నురాలవై ఉన్నావు. ఈ నీ అలంకరణ ఏ ప్రమాదం తెచ్చి పెడుతుందో? ఏ దుష్పరిణామాలకు దారి తీస్తుందో అని పరిపరివిధాల నాఆలోచనలు పరిగిడుతున్నాయి.

3 ఇపుడు నేను వేటగాని నిర్బంధంలో లేను. నా రెక్కల్లో ఎగిసి పోగల శక్తి ఉంది. నేను వేటగాని వలల్లోంచివిడివడి అతని వలపువలల్లో చిక్కు పడిపోయాను. ఇక అతణ్ణి విడిచి పోయే ప్రసక్తే లేదు.

ఆంగ్లేయుల ప్రలోభనాలకు లోబడి కొందరు స్వార్థపరులైన భారతీయులు వాళ్ల అధికారాన్ని పటిష్టంచేయడంలో ఉత్సాహం చూపారు. ఈ పాదంతో వ్యంగ్యంగా ఆ బాధను సూచిస్తున్నాడు.

4 ప్రేయసీసమాగమం నాకు లభించాలని, ఆమె అలుకలను తీరుస్తూ జీవితం గడపాలని ఎన్నాళ్లనుంచో ఉవ్విళ్లూరుతున్నాను. ఆ కోరిక తీరితే ఎంత బాగుండేది!

5 నా గుండెలోని రక్తపుచుక్కలన్నీ నాకనురెప్పలనుంచి గులాబీ పూల లాగా కురిసినవి.

6 "నిన్ను చూడాలని నాకు అమితమైన కోరిక. ఎంతో కాలం తరువాత నా కోరిక పూర్తయింది. నీ సౌందర్యంముందు తలవంచి నానొసటిని భూమికి అంటించ నివ్వు. (నన్ను సాష్టాంగంగా నమస్కరించ నివ్వు) నా యీ ప్రణామాలను కాదనక స్వీకరించు"

7 "ప్రేయసిని ఉద్దేశించి కవి అంటున్నాడు-"నీవు నావంక చూసి నాపట్ల శ్రద్ధవహిస్తే అందులో అనౌచిత్యంఏముంది? నిన్ను పూజించు కొంటూ 'నీవే నా బ్రతుకు, నా ప్రాణం' అని అనుకొంటున్నవాడికి నీవు రక్షణ

యివ్వకపోతే మరెవ్వరిస్తారు! నేనుబీదవాడిని, నీవునన్ను కరుణించవలసిన దానవు. మన యిరువురి సంబంధమే అటువంటిది. నన్ను నీవు కరుణించకపోతే యింకెవ్వరు కరుణిస్తారు, నన్ను రక్షించవలసిన దానవునీవే.''

8 అసదుల్లాఖాన్ ఇకలేడు. అయ్యో! ఒక సౌందర్యోపాసి, ఒక ప్రణయమూర్తి, ఒక మధుపాయి ప్రపంచాన్ని విడిచిపెట్టి పోయాడు.



1 وہ فراق اور وہ وصال کہاں
وہ شب و روز و ماہ و سال کہاں
వొహ్ ఫిరాఖ్ ఔర్ వోహ్ విసాల్ కహాఁ
వొహ్ షబ్ రోజ్వ మాహ్వసాల్ కహాఁ

2 فرصت کاروبارِ شوق کسے
ذوق نظارۂ جمال کہاں
ఫుర్స్తె కారోబారె షౌఖ్ కిసే
జౌఖె నజ్జారయె జమాల్ కహాఁ

3 دل تو دل وہ دماغ بھی نہیں رہا
شور سودائے خط و خال کہاں
దిల్ తో దిల్ వొహ్ దిమాగ్ భీ నరహా
షోరె సౌదాయె ఖతో ఖాల్ కహాఁ

4 تھی وہ اک شخص کے تصور سے
اب وہ رعنائی خیال کہاں
థీ వొహ్ ఎక్ షక్స్‌కె తసవ్వుర్ సే
అబ్ వొహ్ రానాయియె ఖియాల్ కహాఁ

5 ایسا آساں نہیں لہو رونا
دل میں طاقت جگر میں حال کہاں
ఐసా ఆసాఁ నహీఁ లహూ రోనా
దిల్ మెఁ తాఖత్ జిగర్ మెఁ హాల్ కహాఁ

6 فکرِ دنیا میں سر کھپاتا ہوں
میں کہاں اور یہ وبال کہاں
ఫిక్రె దునియామెఁ సర్ ఖపాతా హూఁ
మైఁ కహాఁ ఔర్ యెహ్ వబాల్ కహాఁ

7 مضمحل ہو گئے قویٰ غالب
اب عناصر میں اعتدال کہاں
ముజ్మహిల్ హోగయే ఖువా గాలిబ్
అబ్ అనాసిర్ మెఁ ఎతదాల్ కహాఁ



1 ''జీవితంరో అంతా అయిపోయింది! నాకు యింకేమున్నది?! జీవితాన్ని ఒక విధంగా యీడ్చుకొంటూ పోతున్నాను''- ''ఆవిరహమూలేదు. ఆకలయికలులేవు. ఆ రాత్రులులేవు, ఆ రోజులులేవు, ఆ నెలలులేవు, ఆ సంవత్సరాలు లేవు; ఆ రోజులలోని జవ్వనమూలేదు; అప్పటి ప్రేమ గూడాలేదు!''

2 ''ప్రేమించడానికియిప్పుడు తీరిక యెవ్వరికున్నది! ప్రేయసిసౌంద ర్యాన్ని ఉపాసించడానికి, ఆరాధించడానికి ఉత్సాహం యెక్కడున్నది? ఇవన్నీ జవ్వనంలోని మాటలు. ఇప్పుడు ఆజవ్వనం లేదు, ఆమాటలు లేవు!'' సౌందర్యసాక్షాత్కారసందర్శనానికి ఇప్పుడుత్సాహంలేదు. ప్రణయకలాపాలకు తీరుబాటులేదు.

3 ''ఇప్పుడు నాకు ఆహృదయం లేదు, ఓకాలంలో ప్రేయసి సౌందర్యాన్ని చూడగానే తన్మయతావేశంతో హృదయంలో ఉన్మాదం రేగినట్టుండేది. ఇప్పుడా పరిస్థితిలేదు. నా మనస్సునుగాని నా ఆలోచలనుగాని ఆమె సౌందర్యం కదిలించలేకపోతున్నది,

4 నా భావాలలోని అందచందాలు ఒక వ్యక్తిని ఆశ్రయించుకొని ఉండేవి. ఇప్పుడా వ్యక్తి లేదు కనుక నా భావాలలో అందచందాలే లేవు.

'గాలిబ్' హృదయాన్ని దోచుకొని, చనిపోయిన ఒక ప్రియురాలికి సంబంధించిందీభావం.

5 ప్రణయంలో ఎన్నెన్నో బాధలను అనుభవించవలసి వస్తుంది. ఎడతెగని శోకంతో కన్నీటినే కాదు రక్తాశ్రువులను రాల్చవలసి వస్తుంది. మరి ఆరక్తాశ్రువులవల్ల హృదయం ఆరిపోదా? ప్రేమికునికి గుండెనిబ్బరం అవసరం. వజ్రంలాంటి గుండె ఉండాలె అతనికి. ఇప్పుడు నా హృద యంలో ఆ గట్టితనం లేదు. ఆ నిబ్బరంలేదు. రుధిరాశ్రువులను రాల్చలేను.

6 తలకుమించిన సంసారసమస్యల్లో తలమున్కలు వేస్తున్నాను. ఈ దుఃఖాలు బాధలు నేను సహించగలనా! నావంటి ప్రణయోన్మాదికీ, ఆలోచనలకూ, ఈ బాధలకూ ఏమి సంబంధం?.

7 అవయవాలన్నీ పట్టు తప్పినవి. శరీరతత్వంలో సమతూకమే లేనప్పుడు జీవితమాధుర్యాన్ని అనుభవించే ప్రసక్తే లేదు కదా!



1
حیراں ہوں دل کو روؤں کہ پیٹوں جگر کو میں
مقدور ہو تو ساتھ رکھوں نوحہ گر کو میں
హైరాఁహూఁ దిల్‌కొ రోవూఁకె పీటూఁ జిగర్‌కొ మైఁ
మఖ్దూర్ హోతొ సాథ్ రఖూఁ నౌహగర్‌కొ మైఁ

2
چھوڑا نہ رشک نے کہ ترے گھر کا نام لوں
ہر اک سے پوچھتا ہوں کہ جاؤں کدھر کو میں
ఛోడాన రష్క్‌నేకె తెరే ఘర్‌కా నామ్‌లూఁ
హర్ ఎక్‌సె పూఛ్తాహూఁకె జావూఁ కిధర్‌కొ మైఁ

3
جانا پڑا رقیب کے در پر ہزار بار
اے کاش جانتا نہ تری رہگذر کو میں
జానాపడా రఖీబ్‌కె దర్‌పర్ హజార్ బార్
అయె కాష్ జాన్తాన తెరీ రహెగుజర్‌కొ మైఁ

4
لو وہ بھی کہتے ہیں کہ یہ بے ننگ و نام ہے
یہ جانتا اگر تو لٹاتا نہ گھر کو میں
లో వొహ్ భీ కహ్తె హైఁకె యెహ్ బేనంగొ నామ్ హై
యెహ్ జాన్తా అగర్ తొ లుటాతాన ఘర్‌కొ మైఁ

5
چلتا ہوں تھوڑی دور ہر اک تیز رو کے ساتھ
پہچانتا نہیں ہوں ابھی راہبر کو میں
చల్తాహూఁ థోడీ దూర్ హర్ ఎక్ తేజ్‌రౌకెసాథ్
పహ్‌చాన్తా నహీఁహూఁ అభీ రాహ్బర్‌కొ మైఁ

6
اپنے پہ کر رہا ہوں قیاس اہل دہر کا
سمجھا ہوں دلپذیر متاع ہنر کو میں
అప్నెపె కర్‌రహాహూఁ ఖియాస్ అహ్లె దహెర్‌కా
సమ్ఝాహూఁ దిల్‌పజీర్ మతాయె హునర్‌కొ మైఁ

—o—

1 "ప్రేమలోపడి బాధలను అనుభవించాను. నా హృదయం. కాలేయం రెండు గూడ కృశించి పోయినవి. ఈ రెండింటికి నేనొక్కడినే ఏ విధముగా సానుభూతి తెలుపను! నాలో శక్తి ఉంటే శోకించడానికి మరొ కరిని తప్పకుండా పెట్టుకొని ఉందును."

2 "ప్రియసి యింటికి పోవాలని నాకెంతో ఉన్నది. కాని ప్రేయసి పేరు చెప్పి ఫలానా వారి యిల్లు యెక్కడ అని యే విధంగా అడిగేది! ఎవరికైనా ఆ పేరు తెలిస్తే వారు గూడ ఆ యింటిని వెతుక్కొంటూ పోతారేమోనని భయంగా ఉన్నది. అందువలన 'నేను యెక్కడికి వెళ్ళవలెను. యెక్కడికి వెళ్ళవలెను' అని అందరిని అడుగుతున్నాను"

నలుగురికి తెలిస్తే తనకు ప్రత్యర్థులు తయారవుతారేమోనను భయం, తన ప్రేయసిని గురించి యెవ్వరికి యే విషయం తెలియగూడదన్న ఆందోళన గాలిబ్ గీతాలలో చాల చోట్ల కనుపిస్తుంది

3 నా ప్రత్యర్థి ఇంటికి వెళ్తున్నావనే సంగతి నాకు తెలిసి ఉంటె నేను నిన్ను దారిలో చూసే ప్రయత్నమేమానుకునేవాడిని. నిన్ను వెంబడించి నేను నా ప్రత్యర్థి ఇంటిని చూడవలసిన దుర్గతి నాకు పట్టింది.

4 "ప్రేయసి కొరకు నేను సర్వాన్ని త్యాగం చేసి బిచ్చగాడినై పోయాను. జనులంతా నన్నుచూసి నవ్వుతూ వ్యర్థుడినని, నిష్ప్రయోజకుడినని నిందిస్తున్నారు. వారి మాటలకు నేను చింతించలేదు, చింతించను. కాని ఇప్పుడు యింత జరిగిన తరువాత నాప్రియురాలే నన్ను వ్యర్థుడవని అంటున్నది. ఈ మాటలతో నా హృదయం బ్రద్దలైనాకు పిచ్చిలేచినట్టు అవుతున్నది. ప్రేయసి గూడ నన్నీవిధంగా తిరస్కారం చేయగలదని అనుకొనిఉంటే నేను ఇంత విచ్చల విడిగా త్యాగాలుచేసి, ఇన్ని నష్టాలకు లోనై ఇంతటి హీనస్థితికి రాకపోదును."

5 "జీవిత పథం మీద నడచి పోతున్నాను. నాకు మార్గదర్శి యెవరో తెలుసుకో లేక పోతున్నాను ఎవడు వేగంగానడుస్తుంటే వాడేమార్గదర్శి

అని అనుకొంటున్నాను. కాని వాడుకూడా నా మార్గదర్శికాదని తెలుసు కొని మరొకడిని అనుసరిస్తున్నాను. నిజంగా నాకు మార్గదర్శికాగలవాడు ఎప్పుడువస్తాడో. ఎక్కడతారసిల్లుతాడో తెలియదు.

6 ''నేను కవిని. కవిత్వాన్ని, కళను ఆరాధించి గౌరవించేవాడిని. ఇతరులు గూడ యిదేవిధంగా గౌరవించగలరనుకున్నాను. కాని అది వట్టి బూట కంగా తేలింది. వారికి కళలను గౌరవించడమన్నది తెలియదు; ప్రపం చంలోని ఇతర విషయాలపట్ల వారికి ఆసక్తి" ఉంది కాని కళలపట్లలేదు.



1

سب کہاں کچھ لالہ و گل میں نمایاں ہو گئیں
خاک میں کیا صورتیں ہونگی جو پنہاں ہو گئیں

సబ్ కహాఁ కుఛ్ లాలవొ గుల్ మెఁ నుమాయాఁ హోగయీఁ
ఖాక్ మెఁ క్యాసూరతేఁ హోంగేజొ పిన్హాఁ హోగయీఁ.

2

یاد تھیں ہم کو بھی رنگا رنگ بزم آرائیاں
لیکن اب نقش و نگار طاق نسیاں ہو گئیں

యాద్ థీఁ హమ్‌కొ భీరంగారంగ్ బజ్మె ఆరాయియాఁ
లేకిన్ అబ్ నక్షొనిగారె తాఖె నిస్యాఁ హోగయీఁ.

3

واں گیا بھی میں تو ان کی گالیوں کا کیا جواب
یاد تھیں جتنی دعائیں صرف دربان ہو گئیں

వాఁగయాభీ మైఁతొ ఉన్కి గాలియోఁకా క్యా జవాబ్
యాద్ థీఁ జిత్నీ దుఆయెఁ సర్ఫె దర్బాఁ హోగయీఁ.

4

جانفزا ہے بادہ جسکے ہاتھ میں جام آ گیا
سب لکیریں ہاتھ کی گویا رگ جان ہو گئیں

జాఁఫిజా హైబాదజిస్కే హాథ్‌మెఁ జామ్ ఆగయా
సబ్ లకీరేఁ హాథ్‌కీ గోయారగెజాఁ హోగయీఁ.

5

جوے خون آنکھون سے بہنے دو کہ ہے شام فراق
میں یہ سمجھوں گا کہ شمعیں دو فروزان ہو گئیں

జోయె ఖూఁ ఆంఖోఁసె బహ్నెదోకె హై షామెఫిరాఖ్
మైఁ యె సమ్ఝూంగా కె షమ్మయెఁ దో ఫరోజాఁ హోగయీఁ.

6

ان پریزادوں سے لینگے خلد میں ہم انتقام
قدرت حق سے یہی حوریں اگر واں ہو گئیں

ఇన్ పరీజాదోఁ సె లేంగే ఖుల్ద్ మెఁ హమ్ ఇంతెఖామ్
ఖుద్రతె హఖ్ సె యహీ హూరేఁ అగర్ వాఁ హోగయీఁ.

7

رنج سے خوگر ہوا انساں تو مٹ جاتا ہے رنج
مشکلیں اتنی پڑیں مجھ پر کہ آساں ہو گئیں

రంజ్ సె ఖూగర్ హువా ఇన్సాఁ తో మిట్ జాతాహై రంజ్
ముష్కిలేఁ ఇత్నీ పడీఁ ముఝ్ పర్ కె ఆసాఁ హోగయీఁ.

8

یوں ہی گر روتا رہا غالب تو اے اہل جہاں
دیکھنا ان بستیوں کو تم کہ ویراں ہو گئیں

యూఁహీ గర్ రోతారహా గాలిబ్ తో అయ్ అహ్లెజహాఁ
దేఖ్నా ఇన్ బస్తియోఁ కో తుమ్ కె వీరాఁ హోగయీఁ.



1 అందమైనముఖాలను గురించి ఒక వినూతనమైన భావాన్నికవి యీ చరణాలలో ప్రవేశపెట్టినాడు–''మనం భూమి మీద చూసే అందమైన పుష్పాలన్నీగూడ మట్టిలో కలిసిపోయిన ఆ సుందరీమణుల ప్రతిరూపాలే. ఇటువంటివి, యింకా యింతకంటె సుందరమైన పుష్పాల ప్రతిరూపాలు యెన్నెన్ని భూమిలో దాగిఉండి పైకిరానున్నవో!''

2 "మా కాలంలో మేము గూడ యెన్నోసమావేశాలలో, సుఖసల్లాపాలలో పాల్గొన్నాము. చేయవలసినది గూడ యెంతో చేసినాము, ఇవ్వుడు అదంతాగతము. ఆ విషయాలు యిప్పుడు కనీసం జ్ఞాపకమైనాలేవు. మరపు అనుదానిమీద కేవలము నగిషీలుగామాత్రమే ఉండిపోయినవా సంఘటనలు.''

3 ''ప్రేయసి నన్ను పిలువనంపదు లోనికి వెళ్ళుదామంటే కాపలావాడు లోపలికి వెళ్ళనివ్వడు. బలవంతంగా లోనికిజేసరికి కాపలావాడు తిట్టడం ప్రారంభించాడు. కాపలావాడు తిట్టినకొద్దీ నేను వాడిని దీవించాను''.

జ్ఞాపకం ఉన్నదీవలన్నీ కాపాలావానికే గిట్టినవి. ఇక ప్రేయసి కూడ దూషణకుపూనుకుంటే నేనేమని దీవించాలె?

4 మధువు జీవితానికి ఆహ్లాదాన్ని ప్రసాదిస్తుంది. పానపాత్రిక గ్రహించిన వాని హస్తరేఖలు జీవనతంత్రులై జీవితాన్నిచైతన్యవంతం చేస్తున్నాయి.

5 దుస్పృహమైన ఈ విరహసంధ్యాకాలంలో నాకన్నులనుంచి రుధిరస్రవం తులభుప్రవులై ప్రవహిస్తున్నాయి. అవే ఉవ్వెలై ఈ సంధ్యాతమస్సులకు వెలుగును ప్రసాదిస్తున్నాయనుకుంటాను.

6 తమ ప్రేమికులను బాధించడం రమణులకు అలవాటు. ఇక్కడనైతే యీ అందమైన అంగనలు అష్టకష్టాలపాలు జేస్తున్నారు సరే–ఈ అతివలు స్వర్గంలో అప్సరోభామినులుగా తారసిల్లుతే అక్కడ ప్రతీకారం చేయకుండా ఉండను''.

అక్కడ భగవంతుడు వాళ్లను నాకు సేవచేయడానికి ప్రసాది స్తాడుగా మరి!

7 "మనిషికి ఇబ్బందులు, బాధలు యెక్కువైనప్పుడు అతడు యీ బాధ లన్నింటిని భరించడానికి అలవాటు పడిపోగలడు. ఈబాధలప్రభావం అతని మీద యెంత మాత్రం ఉండదు. ఈ బాధలు బాధలే అనిపించవు నామీద గూడ యెన్నిబాధలువచ్చి పడినవంటే అవి వాటంతట అవే తేలిక అయి పోయినవి."

8 ''ఓప్రపంచప్రజలారా! గాలిబ్ (ప్రేమలో చిక్కుకొని) ఏకధారగా యేడుస్తున్నాడు. అతనిశోకం యిదే విధంగా కొనసాగితే పల్లెలూ, జనప దాలూ కొట్టుకపోయి అంతాపాడుపడి పోగలదు''.



1

یہ ہم جو ہجر میں دیوار و در کو دیکھتے ہیں
کبھی صبا کو کبھی نامہ بر کو دیکھتے ہیں

యేహ్ హమ్‌జో హిజ్ర్ మేఁ దీవార్ వొదర్‌కో దేఖ్తే హైఁ
కభీ సబాకో కభీనామబర్‌కో దేఖ్తే హైఁ.

2

وہ آئیں گھر میں ہمارے خدا کی قدرت ہے
کبھی ہم اُن کو کبھی اپنے گھر کو دیکھتے ہیں

వొహ్ ఆయేఁ ఘర్ మేఁ హమారే ఖుదాకి ఖుద్రత్ హై
కభీహమ్ ఉనోఁకో కభీ అప్నె ఘర్‌కో దేఖ్తే హైఁ.

3

نظر لگے نہ کہیں اسکے دست و بازو کو
یہ لوگ کیوں مرے زخمِ جگر کو دیکھتے ہیں

నజర్ లగేన కహీఁ ఇస్కె దస్తొబాజూకూ
యెలోగ్ క్యవుఁ మెరె జఖ్మె జిగర్‌కో దేఖ్తే హైఁ.

4

ترے جوہر طرف کلاہ کو کیا دیکھیں
ہم اوج طالع لعل و گہر کو دیکھتے ہیں

తెరే జవాహిరె తర్ఫె కులాహ్‌కో క్యాదేఖేఁ
హమ్ ఓజె తాలయె లాలొగొహర్‌కో దేఖ్తే హైఁ.

✕

1. రాత్రి అంతా నిద్రపోకుండా ప్రేయసికొరకు నిరీక్షించినా అలసిపోడు ప్రియుడు. తెల్లవారిన తరువాత గూడ నిరీక్షణావ్యవహారం సాగుతూనే ఉంటుంది ప్రేయసి వద్దనుండి కనీసం కబరైనా వస్తుందేమోనన్న ఆశ. చల్లని పిల్లగాలులు ఆమె తనూసౌరభాల్ని వెంటతెచ్చి ఆమె రాకను గుర్తింపజేయగలవన్న ఆసతో ఒక వంక, ఆమె వద్దనుండి కబురేమైనా రాగలదేమోనన్న ఉత్సుకతతో మరొకవంక, ద్వారాలవైపు పదేపదే చూస్తుంటాడు ప్రియుడు.

2. గాలిబ్ కవి వ్రాసిన యీకవిత చాల ప్రశస్తి సంపాదించింది. దైనందిన సంభాషణల్లో గూడ యీ పంక్తులను తరచుగ ప్రస్తావించడం జరుగు తుంటుంది. ''భగవంతుని మాహాత్మ్యం వల్ల ఆమె (ప్రేయసి) మా ఇంటికి వచ్చింది. ఒకసారి ఆమెను మరొకసారి నా యింటిని చూస్తుం టాను!" ప్రేమికుడు బీదవాడు; పాడుబడిన ఒక చిన్న యింటిలో ఉంటాడు. ప్రేయసి గొప్ప ఇంటిది, ఐశ్వర్యాలతో తులతూగేది. ఆమె తన యింటికి రావడమే ఒక పెద్ద అదృష్టం; ఒకసారి ఆమె వంక మరొకసారి తన యింటి పరిస్థితి వంక చూస్తుంటాడు ప్రేమికుడు.

3. తన ప్రేయసి సౌందర్యాన్ని మరెవ్వరూ గుర్తించకుండా-అంటే ఆస్వా దించకుండా-ఉందురుగాక అని యీ చరణాల అర్థం. విరహంతో ప్రేమి కుని కాలేయం తీవ్రంగా గాయపడింది. ప్రేయసి యెంతో అందమైనది కావడం వల్లనే గాయం యింత తీవ్రంగా ఉన్నది. ''జనులంతా నా గాయాన్ని చూడడానికి వస్తున్నారు. వారంతా యీ నా గాయాన్ని చూస్తే నా ప్రేయసి యెంత అందమైనదో ఊహించుకోగలరు, ఈవిధంగా నా ప్రేయసి అందానికి, ఆకారానికి దృష్టితగిలే ప్రమాదం ఉన్నది. మరి వీరంతా నన్నీవిధంగా చూడడానికి యెందుకు వస్తున్నారు? నా ప్రేయ సికి దృష్టి తగులుతుందోయేమో!''

4. నీ కబరీభరంలో కులుకుతున్న మౌక్తికాలను పద్మరాగాలను చూస్తున్నా ననుకుంటున్నావా? అవి నీకేశపాశంలో చోటుచేసుకుని ఔన్నత్యాన్ని సంపాదించగలిగినందుకు అబ్బురపడుతున్నాను.

—o—

1 دل ہی تو ہے نہ سنگ و خشت درد سے بھر نہ آئے کیوں
روئیں گے ہم ہزار بار کوئی ہمیں ستائے کیوں
దిల్‌హీతో హై నసంగొ ఖిష్ దర్ద్‌సె భర్‌న ఆయెక్యవుఁ
రోయింగె హమ్ హజార్‌బార్ కోయీ హమెఁ సతాయె క్యవుఁ.

2 دیر نہیں حرم نہیں در نہیں آستاں نہیں
بیٹھے ہیں رہگزر پہ ہم کوئی ہمیں اٹھائے کیوں
దైర్ నహీఁ హరమ్ నహీఁ, దర్‌నహీఁ, ఆస్తాఁ నహీఁ
బైఠేహైఁ రహెగుజర్‌పె హమ్‌కోయి హమెఁ ఉఠాయె క్యవుఁ.

3 جب وہ جمال دل فروز صورت مہر نیم روز
آپ ہی ہو نظارہ سوز پردہ میں منہ چھپائے کیون
జబ్‌వొహ్ జమాలె దిల్‌ఫరోజ్. సూరత్ మహ్రె నీమ్ రోజ
ఆప్‌హీహో నజ్జార సోజ్, పర్దెమెఁ ముహ్ఁ ఛుపాయె క్యవుఁ.

4 قید حیات و بند غم اصل میں دونوں ایک ہیں
موت سے پہلے آدمی غم سے نجات پائے کیوں
ఖైదెహయాత్‌వొ బందెగమ్ అసల్‌మెఁ దోనోఁ ఏక్‌హైఁ
మౌత్‌సె పహ్లె ఆద్మీ గమ్‌సె నజాత్ పాయె క్యవుఁ.

5 حسن اور اس پہ حسن ظن رہ گئی بوالہوس کی شرم
اپنے پہ اعتماد ہے غیر کو آزمائے کیوں
హుస్న్ ఔర్ ఇస్‌పె హుస్నెజన్ రహెగయీ బుల్హవస్‌కి షర్మ్
అప్నెపె ఏతమాద్‌హై గైర్‌కొ ఆజ్మాయె క్యవుఁ.

6 واں وہ غرورِ عز و ناز یاں یہ حجاب پاس وضع
راہ میں ہم ملیں کہاں بزم میں وہ بلائے کیوں
వాఁ వొాహ్ గురూరె ఇజ్జొనాజ్, యాఁ యెహిజాబె పాసెవజా
రాహ్‌మెఁ హమ్ మిలేఁ, కహాఁ బజ్మ్‌మెఁ వొాహ్ బులాయె క్యవుఁ.

7 ہاں وہ نہیں خدا پرست جاؤ وہ بے وفا سہی
جسکو ہو دین و دل عزیز اسکی گلی میں جائے کیوں
హాఁ వొాహ్ నహీఁ ఖుదాపరస్త్ జావొా వొాహ్ బేవఫా సహీ
జిస్కొా హొా వొాహ్‌దీఁ దిల్ అజీజ్ ఇస్కీ గలీమెఁ జాయె క్యవుఁ.

8 غالب خستہ کے بغیر کون سے کام بند ہیں
روئیے زار زار کیا کیجئے ہائے ہائے کیوں
గాలిబె ఖస్తకె బగైర్ కౌన్‌సె కామ్ బంద్ హైఁ
రోయియె జార్‌జార్ క్యా కీజియె హాయెహాయె క్యవుఁ.



1 ''నామనసు దౌర్జన్యప్రభావితం కాకపోవడానికి అదేమి రాయికాదు రప్పగాదు. నా హృదయంగూడ మానవహృదయమే. మమ్మలను యెవరైనా బాధిస్తే మనసు దుఃఖంతో పొరలిపోతుంది. ఎవరైనా బాధిస్తే ఒక్కసారిగాదు వేయిసార్లు యేడ్వక తప్పదు, ఎంతటి దారుణాన్నైనా రాయి రప్పలవలె భరించగలమని యెవరైనా మమ్మల్నిగురించి అనుకుంటే అదిపొరపాటు. మేము ఒకసారిగాదు వేలసార్లు యెలుగెత్తి యేడ్వగలము. ఇది యిష్టం లేనివారు మమ్మలను బాధించడానికి పూనుకోవద్దు''

2 "నేను ప్రేయసి నడిచే మార్గంలో కూర్చున్నాను. ఈ ప్రదేశం యే దేవాలయానిదికాదు, మసీదూకాదు. ఇది యెవరి ద్వారమూ కాదు; యెవరి కడపకాదు. అయినా నేను యిక్కడ కూర్చోవడం సైతం నా ప్రత్యర్థికి యిష్టంలేదు. అతడు నన్ను యిక్కడినుంచి గూడ జరిపి వేయాలను కుంటున్నాడు. ఇది యెంతటి అన్యాయం! యెంతటి దౌర్జన్యం''

3 ''మధ్యాహ్న సూర్యునివలె ప్రకాశిస్తున్నది ప్రేయసీసౌందర్యం. ఆమె సౌందర్యాన్ని యెవరైనా చూడదలచుకున్నా చూడలేరు; కాలి మాడి పోగలరు. ఇటువంటప్పుడు ఆమె తన ముఖాన్ని పరదాలో యెందుకు దాచుకోవాలో! నీ ముఖం మీద పరదాలేక పోయినప్పటికి నిన్నెవ్వరు చూడ లేనప్పుడు మరి యీ పరదా యెందుకు!?''

4 ఈ పంక్తులలో దుఃఖానికి సంబంధించిన వేదాంతం యిమిడిఉన్నది. జీవితంలోని యాథార్థ్యాలకు సంబంధించిందీ వేదాంతం. మానవుడు జీవితనిర్బంధంలోనికి వచ్చినప్పుడే దుఃఖశృంఖలాల్లో చిక్కుకొని పోయినాడు. వాస్తవానికి జీవితనిర్బంధం, దుఃఖశృంఖలాలు యీరెండూ ఒక్కటే. జీవితంలో దుఃఖశృంఖలాలనుంచి విముక్తిని పొందలేము. మృత్యువేగనుక ఒకవేళ విముక్తిని కలిగించదలచుకుంటే యీ రెండింటినుండి గూడ విముక్తిని పొందవచ్చును. మృత్యువుకు పూర్వంమాత్రం విముక్తి సాధ్యంకాదు.

5 ప్రేయసికి తన సౌందర్యం విర్దుష్టమైందని తెలుసు. ఇతరులపట్ల ఆమె కెప్పుడూ సద్భావం ఉంటుంది. కనుకనే ఆమె నా ప్రత్యర్థిని పరీక్షించడంలేదు. ఈ కారణంచేతనే నా ప్రత్యర్థి మనోమాలిన్యం బహిర్గతం కావడంలేదు.

6 మేమెక్కడో దారిలో ప్రియురాలిని కలుసుకోలేము. ఆత్మాభిమానం ఔచిత్యం సంప్రదాయాలు అడ్డువస్తాయి. నేరుగా ఆమెతో మాట్లాడలేము. ఆభిజాత్యంవల్ల తన సభ (ఇంటికి) రమ్మని ఆమె ఆహ్వానించదు. అది ఆమె గర్వం, నయగారం. ఇలాంటి పరిస్థితుల్లో కలుసుకోవడం సాధ్యమౌతుందా?

7 ప్రియురాలి మీద తన ప్రత్యర్థి మోపిన నేరాలనుప్రతిఘటిస్తూ ప్రేయసిని సమర్థిస్తున్నాడు గాలిబ్ "ప్రేయసికి దైవభీతిలేదు, ఆమె విశ్వాసపాత్రురాలుకాదు. నిజమే. కాని మరిదైవభీతి. స్వాభిమానంఉన్న మీరు ప్రియురాలి వీధిలోనికి యెందుకోసం వెళ్ళవలసివచ్చింది? మీకిష్టంలేకపోతే మీరు వెళ్లకండి, నాకిష్టం నేను పోతాను, దూషణ అనవసరం.

8 తన మరణం తరువాత ఎలాంటి పరిణామాలు తారసిల్లుతాయో, ఎవరేమనుకుంటారో ఊహిస్తాడుగాలిబ్. పలచోట్ల ఇలాంటి ఊహలను చాలా అందంగా, వ్యంగ్యగర్భితంగా తన కవితలలో ప్రకటించాడు. గాలిబ్ జరాపీడితుడు, నిర్భాగ్యుడు. అతడు చనిపోతే మునిగిపోయేదేముంది? ఏపనులాగినవి? అన్నివ్యవహారాలు సజావుగానే సాగిపోతున్నవి కదా!

"నేను చనిపోయిన తరువాత ఈకల్లిబొల్లి ఏడ్పులెందుకు? నీ శృంగారానికి ఆటంకమేముంది? ఈ సానుతాపం ఈ దుఃఖప్రదర్శనం ఎవరిని ఓదార్చడానికోమరి!

—o—

1

غنچہ نا شگفتہ کو دور سے مت دکھا کہ یوں
بوسہ کو پوچھتا ہوں میں منہ سے بتا کہ یوں

ఘుంచయె నాషుగఫ్తాకా దూర్ సె మత్ దిఖాకె యూఁ
బోసెకో పుఛ్తాహూఁ మైఁ ముఁహ్ సెబతాకె యూఁ.

2

پرسش طرز دلبری کیجئے کیا کہ بن کہے
اس کے ہر اک اشارہ سے نکلے ہے یہ ادا کہ یوں

పుర్సిషె తర్జె దిలేరీ కీజియెక్యాకె బిన్ కహే
ఇస్కెహర్ ఎక్ ఇషారేసె నిక్లెహై యెహ్ అదాకెయూఁ.

3

رات کے وقت مے پیئے ساتھ رقیب کو لئے
آئے وہ یاں خدا کرے پر نہ کرے خدا کہ یوں

రాత్ కె వఖ్త్ మయెపియె, సాథ్ రఖీబ్ కో లియే
ఆయె వొహ్ యాఁ ఖుదాకరే, పర్ నకరే ఖుదాకె యూఁ.

4

غیر سے رات کیا بنی یہ جو کہا تو دیکھئے
سامنے آن بیٹھنا اور یہ دیکھنا کہ یوں

గైర్ సె రాత్ క్యాబనీ యెహ్ జోకహాతో దేఖియే
సామ్నె ఆన్ బైఠ్నా ఔర్ యెహ్ దేఖ్నాకె యూఁ

5

میں نے کہا کہ بزم ناز غیر سے چاہئے تہی
سن کے ستم ظریف نے مجھکو اٹھا دیا کہ یوں

మైఁనె కహాకె బజ్మెనాజ్ గైర్ సె చాహియె తహీ
సున్ కె సితమ్‌జరీఫ్‌నే ముఝ్కొ ఉఠా దియాకె యూఁ.

6 گر ترے دل میں ہو خیال وصل میں شوق کا زوال
موج محیط آب میں مارے ہے دست و پا کہ یوں
గర్ తెరే దిల్ మెఁ హో ఖియాల్ వసల్ మెఁ షౌక్ కా జవాల్
మౌజె ముహీతె ఆబ్ మెఁ మారే హై దస్తొపా కె యూఁ.

7 جو یہ کہے کہ ریختہ کیونکہ ہو رشک فارسی
گفتہ غالب ایک بار پڑھ کے اسے سنا کہ یوں
జో యెహ్ కహే కె రీఖ్తా క్యవుఁ కర్ హో రష్కె ఫార్సీ
గుఫ్తయె గాలిబ్ ఏక్ బార్ పఢ్ కె ఉసే సునా కె యూఁ.



1 కవి యీ పాదాల్లో ఉన్నతమైన రసికతను ప్రదర్శిస్తున్నాడు. ప్రేయసి పెదవులను మొగ్గలతో పోల్చడం ఉర్దూ కవిత్వంలో పరిపాటి. మొగ్గతో అంటుకొని ఉన్న రెండు రెక్కల్ని--రెమ్మల్ని రెండు పెదవులతో పోల్చుతారు. అయితే ముద్దు అన్నది యే విధంగా ఉంటుందో చూపించు అని ప్రియుడు ప్రేయసితో అంటున్నాడు. అందుకు సమాధానంగా, దూరంగా ఉన్న ఒక మొగ్గవైపు చూపిస్తుంది ప్రేయసి. ఇతంటితో ప్రేమికునికి సంతృప్తి కలుగదు. అప్పుడు మరికొంచెం విడమర్చి 'నాకు కావలసింది నీ పెదవులను ముద్దుపెట్టుకోవడం. అందువల్ల, సమీపంగావచ్చి నీ పెదవులను విప్పి ముద్దు ఈ విధంగా ఉంటుంది అని చూపించు'

(వికసించని కుట్మలాన్ని చూపేకన్న చుంబనం చేసి ముఖతః చూపలేవా?)

2 'నీవు హృదయాలను యేవిధంగా అపహరిస్తావు' అని ప్రేయసిని అడుగడం అనవసరం అంటున్నాడు గాలిబ్, ఈ విషయాన్ని అర్థం చేసుకోవాలంటే ఆమె వలపుల్ని, సోయగాన్ని చూసి తీరాలి. ఆమెలోని వలపులు, ఆమెలోని సోయగాలు మాత్రమే యీ ప్రశ్నకు సమాధానాలు.

3 'దేవుడు మేలుచేసి, రాత్రిపూట బాగా పానాన్ని సేవించి ప్రేయసి తన ఇంటికి రావాలి కాని తన ప్రత్యర్థి మాత్రం ఆమె వెంట ఉండగూడదు' అని ప్రేమికుని కోరికను వ్యక్తపరుస్తున్నాడు.

4 రాత్రి తన ప్రత్యర్థితో గడిపిన విధానాన్ని గురించి కవి తన ప్రేయసిని ప్రశ్నిస్తాడు, అప్పుడు ఆమె ఆవేశంతో వచ్చి, తన యెదుట కూర్చుండి, రాత్రి ప్రత్యర్థితో యేవిధంగా గడిపింది తన కళ్లద్వారా వ్యక్తపరుస్తుంది. ఇది యేమి అన్యాయం అంటూ కవి తన పట్ల సానుభూతిని కోరుతున్నా. 'న్యాయమంటే యిదేనా; రాత్రింతా తన ప్రత్యర్థితో గడపనూ గడిపింది, మళ్లీ యింత నిష్కర్షగా, నిర్దయగా ఆ అనుభవాన్ని ప్రకటించడమూ జరుగుతున్నది!'

5 నీ సాంగత్యంలో, నీసాన్నిధ్యంలో నా ప్రత్యర్థి ఉండగూడదు. అతనిని తొలగించివేయమని కవి తన ప్రేయసిని కోరగా, నవ్వుతూనే ప్రాణాలను తీయగలిగే ఆ నిర్దయురాలు కవిని అచ్చటినుండి లేపి "ఏం, నీ ప్రత్యర్థిని తొలగించవలసింన తీరు ఇదే కదూ? అన్నది.

6 గాలిబ్ కవి యీ గీతంలో (గజేల్‌లో) చాలాసున్నితమైన అభిప్రాయాన్ని పొందు పరచినాడు. ఈ గీతం ముద్దుతో ప్రారంభమై యీ భావాలతో పూర్తి అవుతున్నది. ప్రేయసిసమాగమం లభించిన తరువాత ప్రియుని ఉత్సాహం, ఉద్వేగం తగ్గగలవని అనుకొనేవారు నీటిని, అందులోనితరంగాలను గురించి ఆలోచించాలె. తరంగం నీటితోకలిసిఉన్నా ఉత్సాహోద్వేగాలు అలానే ఉంటాయి ప్రేయసి సమాగమం లభించిన తరువాత గూడ ప్రియునిలో ఉత్సాహం, ఉద్వేగం తగ్గకుండా ఉండవలెనంటే ఆ అలలతో ఉత్తేజాన్ని పొందాలి. సమాగమంలో ఉండే సుఖసంతోషాలను మాత్రమే ప్రేమకు ధ్యేయంగా తీసుకోరాదు అని భావం.

7 ''ఉర్దూ కవిత్వం ఫార్సీ కవిత్వానికన్న యేవిధంగా మిన్న అని యెవరైనా ప్రశ్నిస్తే వారికి నా ఉర్దూ కవిత్వం వినిపించండి. అప్పుడువారికి ఉర్దూ కవిత్వం నిజంగానే ఫార్సీకవిత్వం కంటె ఉత్తమమైన దేనన్న నమ్మకం కలుగుతుంది.''



1 کسی کو دے کے دل کوئی نوا سنج فغاں کیوں ہو
نہ ہو جب دل ہی سینے میں تو پھر منہ میں زباں کیوں ہو
కిసీకొ దేకె దిల్ కోయీ నవాసంజె ఫుగాఁ క్యవుఁ హో
నహో జబ్ దిల్ హి సీనే మెఁ తో ఫిర్ ముఁహ్ మెఁ జబాఁ క్యవుఁ హో.

2 کیا غم خوار نے رسوا لگے آگ اس محبت کو
نہ لاوے تاب جو غم کی وہ میرا راز داں کیوں ہو
కియా గమెఖ్వార్ నే రుస్వా లగే ఆగ్ ఇస్ మొహబ్బత్ కొ
నలావే తాబ్ జొ గమ్ కి వొహ్ మేరా రాజ్దాఁ క్యవుఁ హో

3 وفا کیسی کہاں کا عشق جب سر پھوڑنا ٹھہرا
تو پھر اے سنگدل تیرا ہی سنگ آستاں کیوں ہو
వఫా కైసీ కహాఁ కా ఇష్క్ జబ్ సర్ ఫోడ్నా ఠైరా.
తొ ఫిర్ అయె సంగ్ దిల్ తేరాహి సంగెఆస్తాఁ క్యవుఁ హో

4 قفس میں مجھ سے روداد چمن کہتے نہ ڈر ہمدم
گری ہے جس پہ کل بجلی وہ میرا آشیاں کیوں ہو
ఖఫస్ మెఁ ముఝ్ సె రూదాదె చమఁ కహ్తె నడర్ హమ్దమ్.
గిరీ హై జిస్ పె కల్ బిజ్లీ వొహ్ మేరా ఆషియాఁ క్యవుఁవు హో

5 یہ فتنہ آدمی کی خانہ ویرانی کو کیا کم ہے
ہوے تم دوست جسکے اس کا دشمن آسماں کیوں ہو
యెహ్ ఫిత్నా ఆద్మీకీ ఖానా వీరానీకొ క్యా కమ్ హై
హువే తుమ్ దోస్త్ జిస్కే ఉస్కా దుష్మఁ ఆస్మాఁ క్యవుఁ హో

6 نکالا چاہتا ہے کام کیا طعنوں سے تو غالب
ترے بے مہر کہنے سے وہ تجھ پر مہرباں کیوں ہو
నికాలా చాహ్తా హై కామ్ క్యా తానోఁ సె తూ గాలిబ్
తెరే బే మెహర్ కహ్నే సే వొహ్ తుఝ్ పర్ మెహర్బాఁ క్యవుఁ హో

1 ఒకరికి మనసిచ్చి ఆలాపిస్తే ప్రేలాపిస్తే ఏం ప్రయోజనం?. వశానగుండె లేనిదే నోటిలోనాలుక ఉంటుందా.? హృదయందత్తమైనప్పుడు నాలుక కూడా దత్తం కావాలె. అంటే ప్రణయంలో మొరపెట్టుకోవడంవల్ల ప్రయోజనం శూన్యం.

2 రహస్యగోపనం మైత్రీలక్షణం నేను ప్రణయానలంలో దహించుకు పోతుంటే నామిత్రుడొకడు వచ్చి సానుభూతి ప్రకటించాడు. తల్లడిల్లి పోయాడు. దాచుకోలేకపోయాడు. నా ప్రేమ వ్యవహారంలోకమంతా తెలుసుకుంది. ఆ మాత్రంతాలిమి లేనివాడు నాకు మిత్రుడెలా అవుతాడు?

3 ఎక్కడి పరిణయం? ఇక్కడి విశ్వాసం? అంతాహుంకక్కి తలపగుల గొట్టుకునేస్థితికి వచ్చేశాను. అయితే ఓ పాషాణహృదయినీ! నీ కడపకే తలగొట్టుకోవాలా? మరెక్కడా రాళ్లులేవా ఏం?

4 కవిలోని దుఃఖాన్ని వ్యక్తపరచే చక్కనిభావం యీ చరణాల్లో యిమిడి ఉన్నది—"నా మిత్రుడు పూలతోటలను గురించి యేదో చెప్పవచ్చి, నన్నే పంజరంలో చూసి చెప్పడానికి భయపడుతున్నాడు. పిన్న పడ్డ పిడుగు నా గూటి మీదనే పడినదేమోనని ఇతని తరహానుచూసి అర్థంచేసుకొన్నాను. ముందే పంజరంలో ఉన్నాను, దాని మీద మరొక బాధను కలిగించే యీ విషయాన్ని యెందుకు చెప్పవలెనని కావొచ్చు అతను సంకోచిస్తున్నాడు."

గాలిబ్ కవికి కష్టాలను భరించడం అలవాటయి పోయింది. ఎటువంటి దుఃఖాన్నైనా ఆయన భరించడానికి సిద్ధంగా ఉన్నాడు. అందువల్ల వెంటనే గ్రహించాడు.

5 ఉర్దూ కవిత్వంలో ఆకాశాన్ని శత్రువుగా ఊహించుకొనడం రివాజు. ఆపదలు యేవి వచ్చినా ఆకాశం వైపు నుండేనని అనుకోవడం జరుగు తుంది. ప్రేయసి గూడ ఆపదలను, కష్టాలను తెచ్చిపెడుతుంది. అందు వల్ల కవి ప్రేయసిని ఉద్దేశించి అంటున్నాడు—"నీవు యెవరితో స్నేహం చేస్తావో వారితో ఆకాశం యొక్క శత్రుత్వాన్ని తలపెట్టదు. ఎందుకంటే,

నీ స్నేహంతో ఆకాశంవల్ల కలిగే కష్టాలకంటె యెక్కువ కష్టాలే కలుగుతాయి ఆకాశానికి యిక అదేగదా సంతృప్తి.''

6 ఓగాలిబ్! నీవు ఎత్తిపొడుపు మాటలతో, వ్యంగ్యంతో నీ ప్రియురాలి హృదయాన్ని ఆకట్టుకోవాలనుకుంటున్నావా? 'నిర్దయిరాలవని' నీవన్నాక ఆమె నిన్నెలా అనుగ్రహిస్తుంది?



1 دل سے تری نگاہ جگر تک اتر گئی
دونوں کو اک ادا میں رضامند کر گئی
దిల్ సె తెరీ నిగాహ్ జిగర్ తక్ ఉతర్ గయీ
దోనోఁకొ ఏక్ అదామెఁ రజామంద్ కర్ గయీ.

2 شق ہوگیا ہے سینہ خوشا لذتِ فراق
تکلیف پردہ داری زخم جگر گئی
షక్ హోగయాహై సీనా ఖుషాలజ్జతె ఫిరాఖ్
తక్లీఫె పర్దదారీయె జఖ్మె జిగర్ గయీ.

3 وہ بادۂ شبانہ کی سرمستیاں کہاں
اُٹھیے بس اب کہ لذت خواب سحر گئی
వొహ్ బాదయె షబానాకీ సర్మస్తియాఁ కహాఁ
ఉఠియె బస్ అబ్ కె లజ్జతె ఖ్వాబె సహెర్ గయీ.

4 ہر بوالہوس نے حسن پرستی شعار کی
اب آبروئے شیوۂ اہلِ نظر گئی
హర్ బూఉల్హవస్నె హుస్నపరస్తీ షఆర్ కీ
అబ్ ఆబ్రూయె షేవయె అహ్లె నజర్ గయీ.

5 مارا زمانے نے اسداللہ خاں تمہیں
وہ ولولے کہاں وہ جوانی کدھر گئی
మారా జమానేనే అసదుల్లాఖాఁ తుమ్హేఁ
వొహ్ వల్వలె కహాఁ, వొహ్ జవానీ కిధర్ గయీ.



1 నీ చూపుఎంత అందమైనదో ఎంత ప్రభావోపేతమైనదో కాని అది గుండెను చీల్చుకుంటూ కాలేయానికి తాకింది. ఈ రెండూ నీ చూపు తూపుతో గాయపడాలని అభిలషిస్తూ ఉండేవి. ఇప్పుడా రెండూ సంతోషిస్తున్నాయి.

2 విరహావస్థలో ప్రేమికుడు గుండెను అణుచుకోలేక పోయాడు. అది ప్రీలి చీలిపోయింది. ఇందాక అతడాగాయాన్ని దాచడానికి ప్రయత్నం చేస్తుండేవాడు. ఇప్పుడా గాయాన్ని దాచవలసిన అవసరం లేదు దాచడంలో ఉన్న బాధనుంచి అతనికి విముక్తి లభించింది.

3 రేయంతా మధువును సేవించి ప్రత్యూషపవనడోలికల్లో నిద్రాదేవిఒడిలో ఒరిగి పోయేవారు. ఇప్పుడు మేల్కొనండి ఈ ప్రభాతంలో నిద్రాసుఖం అనుభవించడంలో సారస్యంలేదు.

(యవ్వనం గడిచిపోయింది. ముదిమి సంప్రాప్తించింది. ఇప్పుడైనా మేల్కొని జీవితపరమార్థాన్ని సాధించడానికి యత్నించండి) ఇంగ్లీషు వారి ఉచ్చుల్లో ఇరికిపోతున్న భారతీయులకు గాలిబ్ వ్యంగ్యంగా మేలుకొలుపు సందేశాన్ని అదించాడని మహాకవి దాశరధి వ్యాఖ్యానం.

4 సౌందర్యాన్ని గ్రహించి దానిని ఆదరించ గలిగినవాడే ఒక కాలంలో సౌందర్యారాధనకు పూనుకునేవాడు. కాని ఇప్పుడు, ప్రతి వాడు సౌందర్యాన్ని దోచుకోవాలనుకునేవాడే. అంచేత నిజమైన సౌందర్యోపాసకులను కూడా అనుమానిస్తున్నారు. అందాన్ని దోచుకోవాలనుకునేవారు కేవలం వాసనాసక్తులేకాని సౌందర్యోపాసకులుకారు.

5 ఓ అసదుల్లాఖాన్! కాలం నీమీద ఎంత దెబ్బతీసింది? ఏదీ ఆ ఉత్సాహం? ఎటకు పోయింది ఆ జవ్వనం?



1

کوئی دن گر زندگانی اور ہے
اپنے جی میں ہم نے ٹھانی اور ہے
కోయీదిన్ గర్ జిందగానీ ఔర్ హై
అప్నెజీమేఁ హమ్‌నె ఠానీ ఔర్ హై

2

آتش دوزخ میں یہ گرمی کہاں
سوزِ غم ہائے نہانی اور ہے
ఆతిషె దోజఖ్ మేఁ యె గర్మీ కహాఁ
సోజె గమ్ హాయె నిహానీ ఔర్ హై

3

بار ہا دیکھی ہیں انکی رنجشیں
پر کچھ اب کے سر گرانی اور ہے
బార్హా దేఖీ హైఁ ఉన్కీ రంజిషేఁ
పర్ కుఛ్ అబ్ కె సర్ గరానీ ఔర్ హై

4

دے کے خط منہ دیکھتا ہے نامہ بر
کچھ تو پیغام زبانی اوو ہے
దేకె ఖత్ ముఁహ్ దేఖ్తా హై నామబర్
కుఛ్ తో పైగామె జబానీ ఔర్ హై

5

ہو چکیں غالب بلائیں سب تمام
ایک مرگ ناگہانی اور ہے
హో చుకీఁ గాలిబ్ బలాయేఁ సద్ తమామ్.
ఏక్ మర్గె నాగహానీ ఔర్ హై.



1 ఇంకా ఎన్నాళ్లీ వ్యథాభరిత జీవితం ఈడ్వవలసి ఉందోమరి! ఏమైనాసరే! ఇంకా రోజులు గడపవలసిన అవసరమేవస్తే నేను మరింకేదో చెయ్యాలని నిశ్చయించుకున్నాను.

2 గుండెలో ఇల్లుకట్టుకుని దాగిఉన్న బాధాజ్వలనం ముందు ఆ నరకదహన జ్వాలలేపాటి ఏ?

3 "ప్రేయసికి నాపైన యెన్నోసార్లుకోపం వచ్చింది. అయినా నేను ప్రాధేయపడి మన్నించమన్నాను. కాని యీసారి వచ్చిన కోపం తీరే వేరుగా ఉన్నది".

ఇక్కడ గాలిబ్ తన ప్రేయసి కోపాన్ని అర్థం చేసుకున్నట్టే ఉన్నది. ఆయనను-డి శాశ్వతంగా విడిపోవడానికే కాబోలు ప్రేయసికి యీ కోపం వచ్చింది.

4 గాలిబ్ కవి తన ప్రేయసికి ఉత్తరం పంపిస్తాడు. ఉత్తరం తీసుకవెళ్లిన దూత సమాధానం తీసుకవచ్చాడు, అతడు గాలిబ్ ముఖం చూస్తున్నాడు. ఉత్తరంలో వ్రాయలేని విషయాలు గూడ కొన్ని యితనితో చెప్పంపి ఉండ వచ్చునని ఆయన ఆశ. నీళ్లు మ్రింగుతూ నిల్చున్న దూతను చూస్తే మాత్రం శుభసందేశమేదైనా ఉన్నట్టు ఆయనకు అనుపించలేదు. ఆమె కవిని తిట్టినట్టున్నది. అందువల్ల అతడు చెప్పలేక పోతున్నాడు.

5 "ప్రపంచంలో ఉన్న బాధలన్నింటిని అనుభవించాను. ఇప్పుడిక హఠాన్మరణమొక్కటే మిగిలి ఉన్నది. దీని కొరకే సిద్ధమై నిరీక్షిస్తున్నాను."



1 

کوئی امید بر نہیں آتی
کوئی صورت نظر نہیں آتی
కోయీ ఉమ్మీద్ బర్ నహీం ఆతీ
కోయీ సూరత్ నజర్ నహీం ఆతీ

2

موت کا ایک دن معین ہے
نیند کیوں رات بھر نہیں آتی
మౌత్ కా ఏక్ దిన్ మొయ్యన్ హై
నీన్ద్ క్యవుం రాత్ భర్ నహీం ఆతీ

3

جانتا ہوں ثواب طاعت و زہد
پر طبیعت ادھر نہیں آتی
జానతా హూం సవాబె తాఅత్ వో జొహద్
పర్ తబీయత్ ఇధర్ నహీం ఆతీ

4

ہے کچھ ایسی ہی بات جو چپ ہوں
ورنہ کیا بات کر نہیں آتی
హై కుఛ్ ఐసీహీ బాత్ జో చుప్ హూం
వర్నా క్యా బాత్ కర్ నహీం ఆతీ.

5

ہم وہاں ہیں جہاں سے ہم کو بھی
کچھ ہماری خبر نہیں آتی
హమ్ వహాం హైం జహాం సె హమ్‌కో భీ
కుఛ్ హమారీ ఖబర్ నహీం ఆతీ.

6

کعبہ کس منہ سے جاوگے غالب
شرم تم کو مگر نہیں آتی
కాబా కిస్ ముంహ్ సె జావోగె గాలిబ్
షరమ్ తుమ్‌కో మగర్ నహీం ఆతీ.

—o—

1 ఆశ కనుచూపులోలేదు. పరిష్కారమార్గమే కనిపించడంలేదు.

2 ఎప్పుడో ఒకప్పుడు నిశ్చయంగా మరణం సంప్రాప్తిస్తుంది. ఆ దినం ఈవరకే నిర్ణయమైంది. కనుకనే చావాలనుకున్నా చావలేకపోతున్నాను. కాని నిద్ర రాత్రి రావలసిందేకదా. మరి ఆ రాత్రి కూడా నిద్ర పట్టకపోవ డానికి కారణం ఊహించలేకున్నాను.

3 ''ప్రార్థనచేస్తే ముక్తిలభిస్తుందని నాకు తెలుసు. కాని నేను యేం చేయను! నామనసు అటువైపునకు పోనేపోదు.''

4 ''నేను మాట్లాడకుండా మౌనంగా ఉన్నానంటే అందులో యేదో విశేషం ఉంది - లేకపోతే నేనేమి మూగవాడిని కాదు. నేను చాల మాట కారిని. కాని నన్ను ఇప్పుడు అడిగిన విషయమే అటువంటిది; రహస్య మైనది. అందువలన మౌనంగా ఉండక తప్పడంలేదు.''

5 గాలిబ్ తన తన్మయత్వాన్ని గురించి వివరిస్తున్నాడు యిందులో. ఇవి చాల ప్రసిద్ధిపొందిన చరణాలు.

'' ప్రేమలో నేనెంతగాఢంగా మునిగిఉన్నానంటే నేనసలు యెవరిని,? నేనెక్కడ ఉన్నాను? అన్న విషయంనాకే తెలియకుండా ఉన్నది. అటువంటప్పుడు నేనిక నా విషయం ఇతరులకే విధంగా చెప్పేది.''

6 ముస్లిములు కాబాకు వెళ్లితే దానిని హజ్ చేయడం అంటారు. అది భగ వంతుడు ఉండేస్థానమని, అక్కడికి కేవలం పుణ్యాత్ములు మాత్రమే వెళ్లగలరని వారి నమ్మకం.

''జీవితంలో లెక్కలేనన్ని పాపాలుచేసి యే ముఖం పెట్టుకొని హజ్‌చేయడానికి వెళ్లుతావు.వెళ్లుతానని అనుకోవడానికి సిగ్గైనాలేదా నీకు.''

తన ఆలోచనలు ఉత్తమమైనవి అయినా పరిస్థితులు ఆయనను పెడమార్గాలు పట్టిస్తున్నాయి.

1

دلِ ناداں تجھے ہوا کیا ہے
آخر اس درد کی دوا کیا ہے

దిలెనాదాఁ తుఝెహువా క్యాహై
ఆఖిర్ ఇస్ దర్దుకి దవా క్యాహై.

2

ہم ہیں مشتاق اور وہ بیزار
یا الٰہی یہ ماجرا کیا ہے

హమ్ హైఁ ముష్తాఖ్ ఔర్ వొహ్ బేజార్
యా ఇలాహీ యెహ్ మాజరా క్యాహై.

3

میں بھی منہ میں زبان رکھتا ہوں
کاش پوچھو کہ مدعا کیا ہے

మైఁభీ ముఁహ్ మెఁ జబాఁ రఖ్తాహూఁ
కాష్ పూఛోకె ముద్దుఆ క్యాహై.

4

ہم کو ان سے وفا کی ہے امید
جو نہیں جانتے وفا کیا ہے

హమ్‌కొ ఉన్‌సె వఫా కిహై ఉమ్మీద్
జొనహీఁ జాన్తే వఫా క్యాహై.

5

ہاں بھلا کر تیرا بھلا ہوگا
اور درویش کی صدا کیا ہے

హాఁ భలాకర్ తేరా భలా హోగ
ఔర్ దర్వేష్‌కీ సదా క్యాహై.

6

جان تم پر نثار کرتا ہوں
میں نہیں جانتا دعا کیا ہے

జాఁ తుమ్‌పర్ నిసార్ కర్తాహూఁ
మైఁనహీఁ జాన్తా దుఆ క్యాహై.

7

میں نے مانا کہ کچھ نہیں غالب
مفت ہاتھ آئے تو برا کیا ہے

మైఁనె మానాకె కుఛ్‌నహీఁ గాలిబ్
ముఫ్త్ హాథ్ ఆయెతో బురా క్యాహై.



1 ఓ అమాయకహృదయమా! ఏమైందినీకు? ఎందుకలా తల్లడిల్లుతున్నావు? ఏ ఔషధం ఈ బాధను నివారిస్తుంది?

2 తాను ప్రణయోపాసి. ఆమెనుగాఢంగా ప్రేమిస్తున్నాడు. అయినా ఆమె విసుగునే ప్రదర్శిస్తున్నది. ఏమిటి విచిత్రము! ఓఇలాహీ (ఓపరాత్పరా!) ఎమిటీగొడవ.?

3 నాకూ నాలుకఉంది. (సరసంగా, నర్మగర్భంగా, అర్థవంతంగా మాట్లాడ గలను) ఏమి నీ కోరిక? అని ఆమె అడిగితే ఎంత బాగుండేది?

4 నా పట్ల విశ్వాసపాత్రురాలుగా ఉంటుందని నమ్మడం సాధ్యపడదుకదా!

5 మేలు చెయ్యి మేలేకలుగుతుంది. ఇంతకంటె బిచ్చగాని అరుపులో విశేషం ఏముంటుంది. నాకు ప్రణయభిక్షపెట్టు, నేను భిక్షుకుణ్ణి. నేనర్థిస్తున్నాను,

6 ప్రార్థనలు ఎలాచెయ్యాలో నాకు తెలియదు. నీకోసం నా ప్రాణాలే అర్పిస్తాను. ఇదే నాప్రణయపంథా.

7 గాలిబ్ ఎందుకుకూకొరగానివాడని అందరూ అంటూన్నారు, నీవూ అంటు న్నావు. సరే! ఒప్పుకున్నాను. మరి ఇలాంటివాడు వట్టి పుణ్యానికే హస్తగతమవుతున్నాడు నీకు! ఉచితంగా లభిస్తున్న దాన్ని స్వీకరిం చడంలో నష్టమేముంటుంది?



1
حسن مہ گرچہ بہ ہنگام کمال اچھا ہے
اس سے مرا مہ خورشید جمال اچھا ہے
హుస్నె మహ్ గర్చె బహంగామె కమాల్ అచ్ఛాహై
ఇస్‌సె మెరా మహె ఖుర్షీదె జమాల్ అచ్ఛాహై

2
بوسہ دیتے نہیں اور دل پہ ہے ہر لحظہ نگاہ
جی میں کہتے ہیں کہ مفت ہاتھ آئے تو مال اچھا ہے
బోసదేతే నహీఁ ఔర్ దిల్‌పెహై హర్ లహ్‌జా నిగాహ్
జీమెఁకహ్తె హైఁకె ముఫ్త్‌హాథ్ ఆయెతో మాల్ అచ్ఛాహై.

3
ان کے دیکھے سے جو آجاتی ہے منہ پہ رونق
وہ سمجھتے ہیں کہ بیمار کا حال اچھا ہے
ఉన్కే దేఖేసె జొ ఆజాతీహై ముఁహ్‌పె రౌనఖ్
వొహ్ సమఝ్తే హైఁకె బీమార్‌కా హాల్ అచ్ఛాహై

4
دیکھئے پاتے ہیں عشاق بتوں سے کیا فیض
اک برہمن نے کہا ہے کہ یہ سال اچھا ہے
దేఖియె పాతేహై ఉషాక్ బుతోఁసె క్యాఫైజ్
ఏక్ బ్రహమణనె కహాహైకె యెహ్ సాల్ అచ్ఛాహై

5
قطرہ دریا میں جو مل جائے تو دریا ہو جائے
کام اچھا ہے وہ جس کا کہ مآل اچھا ہے
ఖత్ర దర్యామెఁ మిల్ జాయెతొ దరియా హోజాయె
కామ్ అచ్ఛాహై వొహ్ జిస్‌కాకె మఆల్ అచ్ఛాహై

6
ہم کو معلوم ہے جنت کی حقیقت لیکن
دل کے بہلانے کو غالب یہ خیال اچھا ہے
హమ్‌కొ మాలూమ్‌హై జన్నత్‌కీ హఖీఖత్ లేకిన్
దిల్‌కె బహెలానేకొ గాలిబ్ యెఖియాల్ అచ్ఛాహై.

1 షోడశ కళాప్రపూర్ణమైన చంద్రబింబం అందమయిందే. కాని మహాసౌంద ర్యంతో విలసిల్లే సూర్యబింబంలా, అందానికి కాణాచియైన నా ప్రేయసి అందం ముందు చంద్రబింబం ఏపాటిది?

2 ముద్దివ్వదు కాని అనుక్షణం నా గుండెను దోచుకోవాలని చూస్తూ ఉంటుంది ప్రేయసి. ముద్దివ్వకుండానే ప్రియుణ్ణి లోబరచుకోవాలను కుంటున్నది వట్టి పుణ్యానికి దొరికిన వస్తువుగానే ఉంటుంది మరి.

3 రోగ గ్రస్తుడై పడిఉన్న తనను పరామర్శించడానికి ప్రేయసి వచ్చింది. ఆమెను చూడగానే అతని ముఖంలో ఒక నూత్నకాంతితొణికి సలాడింది. 'రోగితేరుకున్నాడే ఇక పర్వాలేదు' అనుకొని ఆమె వెళ్లిపోయింది.

4 ఈ సంవత్సరం చాలబాగున్నదని ఒక బ్రాహ్మణుడు జోస్యంచెప్పాడు, తమ తమ ఈప్సితాలు ఈడేరగలవని ప్రేమికులందరు సంతోషపడ్డారు; ప్రియురాండ్రు తమను కరుణించగలరని నమ్మినారు. విషయమేమి టంటే, ఎవరి ఆలోచన, ఎవరిధ్యాస వారికి – ఈసంవత్సరం బాగుంటుం దని బ్రాహ్మణుడంటే ప్రియురాండ్రు తమను తప్పక కటాక్షించగలరని ప్రేమికులు అనుకుంటున్నారు.

5 నీటి చుక్క ఏటిలో కలిసి ఏరై పోతుంది. ఇది సుకృతం ఏపనిచేసినా ఫలితం దాని సవ్యంగా, సుఖదంగా పరిణమించాలె.

6 గాలిబ్! స్వర్గం అంటే ఏమిటో దాని యథార్థస్వరూపం ఏమిటో మాకు తెలుసు. ఇది ఒక ఆలోచన మాత్రమే. అయితే ఈ ఆలోచనతో మనసును సమాధానపెట్టుకోవచ్చు. హాయిగా ఉండవచ్చు.

వ్యంగ్యంగా స్వర్గం ఉనికినే సవాలుచేస్తున్నాడు.



1
ہر ایک بات پہ کہتے ہو تم کہ تو کیا ہے
تمہی کہو کہ یہ اندازِ گفتگو کیا ہے
హర్ ఎక్‌బాత్‌పె కహ్తే హోఁ తుమ్ కె తూక్యాహై
తుమ్హీకహోఁ కె యెఅందాజె గుఫ్తగూ క్యాహై

2
جلا ہے جسم جہاں دل بھی جل گیا ہو گا
کریدتے ہو جو اب راکھ جستجو کیا ہے
జలాహై జిసమ్ జహాఁ దిల్‌భీ జల్‌గయా హోఁగా
కురేద్‌తే హోఁజొ అబ్ రాఖ్ జుస్తజూ క్యాహై.

3
رگوں میں دوڑتے پھرنے کے ہم نہیں قایل
جو آنکھ ہی سے نہ ٹپکا تو پھر لہو کیا ہے
రగోఁమేఁ దౌడ్తే ఫిర్నేకె హమ్ నహీఁ ఖాయల్
జొ ఆంఖ్‌హీసె నటపాక్‌తో ఫిర్ లహూ క్యాహై.

4
رہی نہ طاقت گفتار اور اگر ہو بھی
تو کس امید پہ کہئے کہ آرزو کیا ہے
రహీ నతాఖతె గుఫ్తార్ ఔర్ అగర్ హోఁభీ
తోకిస్ ఉమ్మీద్‌పె కహియేకె ఆర్తూ క్యాహై.
జు

5
ہوا ہے شہ کا مصاحب پھرے ہے اتراتا
وگرنہ شہر میں غالب کی آبرو کیا ہے
హువాహై షహ్‌కా ముసాహెబ్ ఫిరేహై ఇత్రాతా
వగర్‌న షహెర్‌మేఁ గాలిబ్‌కి అబ్రూక్యాహై.

—o—

1 నేనెవడినో నా అంతస్థు ఏమిటో నీకు బాగుతెలుసు. కాని నలుగురిలో ''నువ్వెంత నీ లెక్కేమిటనాకు'' అని అసత్యంగా, అధిక్షేపిస్తూ మాట్లాడు తున్నావు. ఇలా ప్రసంగించడం నబబే నా చెప్పు.

2 "నేను ప్రేమజ్వాలల్లో కాలి బూడిదై పోయినాను. ప్రేయసికి తెలిసిన తరువాత వచ్చి బూడిదను తోడడం ప్రారంభించింది. ఈ బూడిదలో వెదికేది యెవ్వరిని! ఒక వేళ నాహృదయాన్నే వెదుకుతుంటే, అది నా శరీరంతోపాటే కాలిపోయింది. ఈ బూడిదలో యేమీ దొరుకదు''

3 ''నరాలలో ప్రవహించేదినెత్తురుకాదు; అది మరింకేదో వస్తువు. నెత్తురు అనేది కేవలం ప్రేమికుని కన్నులనుండి మాత్రమే ప్రవహిస్తుంది''

4 ఇప్పుడు మాట్లాడేశక్తి కూడాలేదు. ఒకవేళ ఉన్నా, నాఅభిలాషఏమిటో తెలిసితే ఏమిలాభం? ఆమె శిలాహృదయిని. నా మాటను లక్ష్యపెట్టదు.

5 రాజాస్థానంలో ఆశ్రయం లభించినందువల్ల గాలిబ్ విర్రవీగుతున్నాడే గాని-లేకపోతే ఈ పట్టణం (ఢిల్లీ)లో అతనికి ఉన్న విలువ ఏపాటిది?.

గాలిబ్ ఢిల్లీరాజైన బహద్దుర్‌షా అస్థానంలో ఉందేవాడు కొంతకాలం. బహద్దుర్‌షాకు ఆయన కవితాగురువుకూడ.



1

میں انہیں چھیڑوں اور کچھ نہ کہیں
چل نکلتے جو مے پئے ہوتے
మైఁ ఉన్హేఁ ఛేడూఁ ఔర్ కుఛ్ న కహేఁ
చల్ నికల్తే జో మయ్ పియే హోతే

2

قہر ہو یا بلا ہو جو کچھ ہو
کاش کہ تم میرے لئے ہوتے
ఖహెర్ హో యాబలా హో జొకుఛ్ హో
కాష్ కె తుమ్ మెరేలియే హోతే

3

میری قسمت میں غم گر اتنا تھا
دل بھی یارب کئی دئے ہوتے
మెరీ ఖిస్మత్ మెఁ గమ్ గర్ ఇత్నా థా
దిల్ భీ యారబ్ కయీ దియే హోతే

4

آ ہی جاتا وہ راہ پر غالب
کوئی دن اور بھی جئے ہوتے
ఆహీజాతావొ రాహ్ పర్ గాలిబ్
కోయీదిన్ ఔర్ భీ జియేహోతే.



1 నేనామెను కవ్వించినా ఆమె ఏమీ అనడంలేదు. అలకను ఒలకబోయ డంలేదు నేను మధువుగ్రోలిఉంటే ఇంకాకొంచెంచనువు తీసుకునేవాడినే।

2 నీవు నాకు బాధవే! ఒకపీడవే. అయినా నీవేకావాలి. కాని ఒక్కషరతు. నీవు నాదానివిగానే ఉండాలె.

3 కవి భగవంతునితో అంటున్నాడు: ''నీవునాకు ఏన్నో కష్టాలను వ్రాసి పెట్టినావు. కాని హృదయం మాత్రం ఒక్కటే యిచ్చినావు. నాకున్న బాధలు యెటువంటి వంటే వానిని భరించడానికి యెన్నో హృదయాలు ఉండాలె. బాధలను దృష్టిలో ఉంచుకొని చాల హృదయాలను యిచ్చి ఉంటే న్యాయం చేకూరి ఉండేది!

4 ఎంత తొందరపడ్డాను? కొంచెం ఓపికపట్టి బ్రతికి ఉంటే ప్రేయసి నన్ను అనుగ్రహించి ఉండేదేమో!



1 نکتہ چیں ہے غم دل اسکو سنائے نہ بنے
کیا بنے بات جہاں بات بنائے نہ بنے
నుక్తచీఁహై గమెదిల్ ఇస్కొ సునాయెన బనే
క్యాబనే బాత్ జహాఁ బాత్ బానాయేన బనే

2 میں بلاتا تو ہوں اسکو مگر اے جذبۂ دل
اس پہ بن جائے کچھ ایسی کہ بن آئے نہ بنے
మైఁబులాతాతో హుఁ ఉస్కో మగర్ అయె జజ్బయె దిల్
ఉస్‌పెబణ్‌జాయె కుఛ్ ఐసీకెబిణ్ ఆయేన బనే

3 اس نزاکت کا برا ہو وہ بھلے ہیں تو کیا
ہاتھ آئیں تو انہیں ہاتھ لگائے نہ بنے
ఇస్‌నజాకత్‌కా బురాహో వొహ్ భలేహైఁతో క్యా
హాథ్‌ఆయెఁతో ఉన్హైఁ హాథ్‌లగాయె నబనే

4 بوجھ وہ سر سے گرا ہے کہ اٹھائے نہ بنے
کام وہ آن پڑا ہے کہ بنائے نہ بنے
బోఝ్‌వొహ్ సర్‌సె గిరాహైకె ఉఠాయెన బనే
కామ్‌వొహ్ ఆణ్ పడాహైకె బనాయేన బనే

5 عشق پر زور نہیں ہے یہ وہ آتش غالب
کہ لگائے نہ لگے اور بجھائے نہ بنے
ఇష్క్‌పర్ జోర్ నహీఁ, హై యెహ్‌వొహ్ ఆతిష్ గాలిబ్
కె లగాయెన లగే ఔర్ బుఝాయెన బనే.



1 నామనోవ్యథను ఆమెకు వినిపించాలనుకున్నాను. కాని నన్నామె తరచి తరచి విమర్శిస్తుంది. ఆమె నన్ను మాట్లాడుకుండా చేస్తున్నది. ఆమెకు వినిపించాలనే ఉద్దేశం ఈ పరిస్థిలో ఎలా పూర్తి అవుతుంది?

2 ''నేను ప్రేయసిని ఆహ్వానిస్తాను! కాని రాకుండా తప్పించుకొనడానికి ఆమె దగ్గర సాకులకు కొరువలేదు. అందువలన, ఓ ప్రేమకాంక్షా, ఓ ప్రగాఢమైన ప్రణయ భావమా! ఆమె నా దగ్గరికిరాకుండా ఉండలేనట్టుగా (తప్పకుండా నాదగ్గరికివచ్చి వేయునట్టుగా) ఆమె మీద యేదైన మంత్రం గాపారాలె! ఆమెను మంత్రముగ్ధను గావించాలె!'' ప్రేమ ప్రభావము వల్లనైనా ఆమె పరితపింస్తునా తన వద్దకు పరుగెత్తివస్తే బాగుండును

నేనెంతపిలిచినా ఆమె రాకుండా ఉన్నది. నా హృదయమా! ఆమెనెలాగైనా ప్రేరేపించు. ఆమెను నా వద్దకు రప్పించు.

3 ఎందుకీ వల్లమాలినసౌకుమార్యం.? ముట్టుకుంటేనే మాసిపోతున్నది. ఆమెను తాకలేక పోతున్నాను ఇంత సుకుమారిని పొందడంలో ఏమి ప్రయోజన ముంది? ఏమి అనందముంది?

4 ''ప్రేమ భారాన్ని మోసుకుంటూ నేను యింతవరకు గూడ బ్రతుకుతూ వచ్చాను. నేనిప్పుడు యెంత బలహీనుణ్ణయి పోయానంటె ఆధారం నాపై నుండి క్రింద పడిపోయింది. దానిని తిరిగి యెత్తుకొని పైకి పెట్టుకోలేక పోతున్నాను. ప్రేమలేకుండా ముందుకు నడచిపోదామంటే అది గూడ సాధ్యంగాకుండా ఉన్నది. ఇప్పదిక నేను చెప్పలేని యిబ్బందిలో పడి పోయాను-ప్రేమ భారాన్ని మోయగల శక్తి లేదునాలో. ఆధారం లేకుండా ముందుకు సాగలేను'' ఇదీనా అవస్థ.

5 ఈ రెండు చరణాల్లో గాలిబ్ కవి ప్రేమను చాల చక్కగా నిర్వచిస్తు న్నాడు.

పేర్రిమ ఒక జ్వాలవంటిది. దాని మీద యెవ్వరికీ అదుపులేదు. అది యెవరి ఆజ్ఞలోను ఉండదు. ఎవరైనా యీ జ్వాలను ఒక ప్రత్యేక మైన చోట రగుల్కొల్పదలచుకుంటే అది అక్కడ రగుల్కొనదు. రగుల్కొన్నచోట యెవరైనా దానిని ఆర్పివేయదలచు కుంటే అది ఆరిపోదు. అది ఒక విచిత్రమైన జ్వాల; అది యెక్కడ రగులదలచు కుంటె అక్కడ రగులుకొంటుంది. తిరిగి ఆర్పదలచుకున్నా ఆరదు ఆప్రేమజ్వాల!



1

ابن مریم ہوا کرے کوئی
میرے دکھ کی دوا کرے کوئی
ఇబ్నె మరియమ్ హువా కరే కోయీ
మేరే దుఖ్‌కి దవా కరే కోయీ

2

بات پر واں زباں کٹتی ہے
وہ کہیں اور سنا کرే کوئی
బాత్ పర్ వాఁ జబాఁ కట్తీ హై
వొ కహేఁ ఔర్ సునా కరే కోయీ.

3

بک رہا ہوں جنوں میں کیا کیا کچھ
کچھ نہ سمجھے خدا کرے کوئی
బక్ రహా హూఁ జునూఁ మేఁ క్యా క్యా కుఛ్
కుఛ్ న సమ్ఝే ఖుదా కరే కోయీ

4

کون ہے جو نہیں ہے حاجت مند
کس کی حاجت روا کرے کوئی
కౌన్ హై జో నహీఁ హై హాజత్‌మంద్
కిస్‌కి హాజత్ రవా కరే కోయీ.

5

کیا کیا خضر نے سکندر سے
اب کسے رہنما کرے کوئی
క్యా కియా ఖిజర్ నే సికందర్ సే
అబ్ కిసే రహెనుమా కరే కోయీ.

6

جب توقع ہی اٹھ گئی غالب
کیوں کسی کا گلہ کرے کوئی
జబ్ తవఖ్ఖా హీ ఉఠ్ గయీ గాలిబ్
క్యూఁ కిసీకా గిలా కరే కోయీ.

1 మసీహా మహాశయుడు (ఏసుక్రీస్తు) రోగగ్రస్తులకు ఆరోగ్యం చేకూర్చే వాడని ఒక విశ్వాసము. నిజంగానే ఆయన ఆవిధంగా చేసేవాడేమో! కాని నేనిప్పుడు అవస్థపడుతున్నాను. దానిని నివారించగలవారేరి? నా యీ బాధను యెవ్వరైనా తీర్చి, నా కొరకు వారు మసీహాగా రూపొంది పుణ్యం కట్టుకుంటే'.

2 ఆమె సమక్షంలో నా నాలుకమూగబోతుంది ప్రతి మాటకు ప్రతిఘాతాన్ని ప్రయోగిస్తుందామె. ఎవరైనా వినవలసిందేకాని అనవలసిందేమీలేదు ఆమె ముందు.

3 నేనున్మాదావస్థలో ఏమేమో పేలుతున్నాను. భగవంతుని దయవల్ల ఎవడూ నా మాటలను పట్టించుకోకపోతే బాగుండేది.

4 “ప్రపంచంలో ప్రతి మనిషికి యేదో ఒక అవసరం ఉంటూనే ఉంటుంది. ఈ అవసరాన్ని యెవరైనా తీర్చదలచుకుంటె యెందరి అవసరాలని తీర్చగలరు! అందరు అవసరాలున్నవారే గదా!” ప్రపంచంలో యెవ్వరూ యెవ్వరి అవసరాలను తీర్చరు. యెవరికి వారే తమ అవసరాలను తీర్చుకోవడం మంచిది.

5 సికందర్ అమృతాన్ని అన్వేషించడానికి బయలుదేరినప్పుడు ఆయనకు ఖిజర్ మార్గదర్శి అయ్యాడట. ఒక చోటికి పోయిన తరువాత సికందర్‌ను వదలిపెట్టి ఖిజర్ తానొక్కడే అమృతం ఉన్న ప్రదేశాన్ని చేరుకున్నాడు. ఖిజర్ అంతటి మహానుభావుడే ఆవిధంగా మోసగించినప్పుడు మరి ఇతరుల విషయం యిక అడుగవలసిన అవసరంలేదు గదా.!

సికందర్ — ఒక ప్రభువు

ఖిజర్ — ఒక ప్రవక్త

6 గాలిబ్! నిరాశాహతుడవై ఆమె మీద నమ్మకమే పోయాక ఆమెను నిందించి ఏమి సాధిస్తావు నీవు!

—0—

1
نوید امن ہے بیداد دوست جاں کے لئے
رہی نہ طرز ستم کوئی آسمان کے لئے
నవీదె అమ్న్ హై బేదాదె దోస్త్ జాఁ కె లియే
రహీ న తర్జె సితమ్ కోయీ ఆస్మాఁ కె లియే.

2
وہ زندہ ہم ہیں کہ ہیں روشناس خلق اے خضر
نہ تم کہ چور بنے عمر جاودان کے لئے
వో జిందా హమ్ హైఁ కె హైఁ రూషినాసె ఖల్క్ అయె ఖిజర్
న తుమ్ కె చోర్ బనే ఉమ్రె జావెదాఁ కె లియే.

3
فلک نہ دور رکھ اس سے مجھے کہ میں ہی نہیں
دراز دستی قاتل کے امتحان کے لئے
ఫలక్ నదూర్ రఖ్ ఇస్‌సె ముఝ్‌కె మైఁ హీ నహీఁ
దరాజ్ దస్తియె ఖాతిల్ కె ఇమ్తెహాఁ కె లియే.

4
مثال یہ میری کوشش کی ہے کہ مرغ اسیر
کرے قفس میں فراہم جس آشیان کے لئے
మిసాల్ యెహ్ మెరీ కోషిష్ కీ హై కె ముర్గ్ అసీర్
కరే ఖఫస్ మెఁ ఫరాహమ్ జిస్ ఆషియాఁ కె లియే.

5
گدا سمجھ کے وہ چپ تھا میری جو شامت آئی
اٹھا اور اٹھ کے قدم پاسبان کے لئے
గదా సమఝ్‌కె వోహ్ చుప్‌థా మెరీ జో షామత్ ఆయీ
ఉఠా ఔర్ ఉఠ్‌కె ఖదమ్ పాస్బాఁ కె లియే.

6

ادائے خاص سے غالب ہوا ہے نکتہ سرا

صلائے عام ہے یاران نکتہ دان کے لئے

అదాయె ఖాస్‌సె గాలిబ్ హువాహై నుక్తసరా

సలాయె ఆమ్‌హై యారానె నుక్తదాఁకె లియే.



1 "ప్రేయసి నామీద యెన్నో విధాలుగా దౌర్జన్యం జరుపుతున్నది. కానీ నేను ఆమె దౌర్జన్యాన్ని గూడ శాంతికి కారణమే అనుకుంటున్నాను. ప్రేయసి యెన్నెన్ని విధాలుగా బాధపెట్టుతుందో అంతకు మించిన విధానాలేవీ ఆకాశం వద్ద లేవు. ఈవిధంగా ప్రేయసి పెట్టే బాధలను భరిస్తూ ఆకాశపు బాధలనుండి తప్పించు కొగలిగినాను."

ప్రేయసి నన్ను సాధిస్తున్నది. ఆరాటపెడుతున్నది. అనేక విధాల మనస్సు ఉమ్మలికం పాలుచేస్తున్నది. ఇక దైవం నన్ను చేయగలిగేది ఏముంది?

ఉర్దూ కవితలో ఆకాశం విధికి దైవానికి సంకేతం.

2 దూరతీరాల్లో నిర్మానుష్యమైన ప్రదేశాల్లో అనుభవశూన్యమైన శాశ్వతత్వం కలిగి ఉండడం చౌక్యమే. నలుపురిలోఉండి వారికష్టసుఖాల్లో పాల్గొంటూ ఆ ప్రేమ జీవితాన్ని అనుభవిస్తూ కొద్దికాలం పాటు బ్రతుకడంలో పుణ్యమూఉంది పురుషార్థమూఉంది.

3 ఓదైవమా! ఆరడిపెట్టే ప్రేయసికీ నాకూదూరాన్ని కల్పించకు. దూరంగా ఉండి ఆమె నన్నెలా చిత్రవధ చేయగలుగుతుందో చూద్దామని ఉందా? నన్నొకక్రొత్త పరీక్షించడం ఎందుకు? నాకుసామీప్యాన్నే కలిగించు. అంతగా ఉంటే ఇతరులను ఆమెతో దూరంగా ఉంచిచూడు.

4 గాలిబ్ కవి ఒక చిన్న ఉదాహరణతో తన జీవితాన్ని యిందులో వివరిస్తున్నాడు. వినేవారు ఆయన పట్ల సానుభూతిని చూపించి, ఆయన కొరకు యెంతటి త్యాగం చేయడానికైనా సిద్ధమయ్యేటట్టు చాలనేర్పుతో తన గొడవను వివరిస్తున్నాడు.

"నేను యీ ప్రపంచంలో ఒక ఖైదీ వంటి వాడిని. పంజరంలో ఉన్న ఒక పక్షి పంజరంలోనె గూడు కట్టుకోవడానికి గడ్డిపోచలను ప్రోగుచేసుకున్నట్టుగా ఉన్నది నేను యీ ప్రపంచంలో జీవించడానికి చేసే ప్రయత్నం!"

గాలిబ్ ప్రథమ భారత స్వాతంత్ర్యసమరాన్ని కన్నులారా చూశాడు. బాధలకులోనైనాడు. సమకాలీన భారతీయజీవనం ఎలాంటిపరిణామాలకు బలి అయిందో వ్యంగ్యంగా చిత్రించాడీపద్యంలో.

5 "నేను ప్రేయసి ద్వారం ముందు కూర్చొని ఉన్నాను. ద్వారం దగ్గర ఉండే కాపలావాడు యితడెవరో బిచ్చగాడనుకొని ఊరుకున్నాడు. ఈ కాపలామనిషికి నమస్కరించి, కాళ్లుపట్టుకుంటె లోపలికి పోనిస్తాడేమో నని నాకు లోలోన ఒక ఆశ చిగురించింది. కాని కథ అడ్డం తిరిగింది. నేను అతని కాళ్లుపట్టుకొని బ్రతిమిలాడేసరికి అతను నేను నిజంగా ప్రేమి కుడి నేనని గ్రహించినాడు. నన్ను అడ్డగించడమే తన విధి అనుకొని దేహశుద్ధిచేసి పంపించినాడు".

ఈపై రెండు చరణాల్లో కొన్నిపదాల సహాయంతో ఒక సంఘట నను గాలిబ్ యెంతో అందంగా అభివర్ణించినాడు. ఆ సన్నివేశం మన కన్నులముందు నిలిచి 'అయ్యో, పాపం, ప్రేమికులు యెంతటిహీనమైన పరిస్థితిని యెదుర్కొనవలసి వస్తుంది' అని అనిపిస్తుంది. ఒక బిచ్చ గానివలె ప్రేయసి యింటిముందు కూర్చొనడం! అందులోను కాపలావాని కాళ్లు పట్టుకొనడం! అంతకు మించి దేహశుద్ధి!!

6 తన కవిత్వాన్ని గురించి, తన గజళ్లను గురించి గాలిబ్ వివరిస్తున్నాడు- "నేను యథార్థాలను ఒక ప్రత్యేకమైన పద్ధతిలో కవితారూపంలో సాక్షా త్కరింపజేస్తున్నాను. యథార్థాలను గ్రహించగలిగి, నేర్పును అర్థం చేసుకోగలిగిన వారంతా నా కవిత్వాన్నిరుచి చూసి పరీక్షించవలసినదని ఆహ్వానిస్తున్నాను."



1

تسکیں کو ہم نہ روئیں جو ذوقِ نظر ملے
حورانِ خلد میں تری صورت مگر ملے

తస్కీఁకో హమ్ నరోయెఁ జో జౌఖె నజర్ మిలే
హూరానె ఖుల్ద్ మెఁ తెరీ సూరత్ మగర్ మిలే

2

اپنی گلی میں مجھ کو نہ کر دفن بعد قتل
میرے پتہ سے خلق کو کیوں تیرا گھر ملے

అప్నీ గలీమెఁ ముఝ్‌కో నకర్ దఫ్న్ బాదె ఖత్ల్
మేరే పతేసె ఖల్ఖ్‌కో క్యవుఁ తేరా ఘర్ మిలే

3

ساقی گری کی شرم کرو آج ورنہ ہم
ہر شب پیا ہی کرتے ہیں مے جس قدر ملے

సాఖీగిరీకి షర్మ్‌కరో ఆజ్ వర్నహమ్
హర్‌షబ్ పియాహి కర్తేహైఁ మయె జిస్‌ఖదర్ మిలే.

4

تجھ سے تو کچھ کلام نہیں لیکن اے ندیم
میرا سلام کہیو اگر نامہ بر ملے

తుఝ్‌సేతో కుఛ్ కలామ్‌నహీఁ లేకిన్ ఆయె నదీమ్
మేరా సలామ్ కహియో అగర్ నామబర్ మిలే.

5

تم کو بھی ہم دکھائیں کہ مجنوں نے کیا کیا
فرصت کشاکشِ غمِ پنہاں سے گر ملے

తుమ్‌కోభీ హమ్ దిఖాయెఁకె మజ్నూనే క్యా కియా
ఫుర్సత్ కషాకషె గమె పిన్హాఁసె గర్ మిలే.

6

اے ساکنانِ کوچۂ دلدار دیکھنا
تم کو کہیں جو غالبِ آشفتہ سر ملے

సాయె సాకినానె కోచయె దిల్దార్ దేఖ్నా
తుమ్‌కో కహీం జో గాలిబె ఆషిఫ్త సర్ మిలే.



1 ''నేను స్వర్గంలో ఉన్నాను: ప్రేయసినాకు దూరంగా ఉన్నది. కేవలం నా ప్రేయసి నాకు లభిస్తేచాలు, అందులోనె నాకు అంతులేని సంతృప్తి ఉన్నది. నా ప్రేయసి నాకు లభ్యం కాకపోతే నా ప్రేయసి అందాన్ని కలిగినటువంటి దేవకన్యలెవరైనా లభించినా వారి ముఖాలలో నా ప్రేయసిని దర్శిస్తూ సంతృప్తి పొందగలను. ఈ మాత్రం ప్రయత్నం జరుగగలిగితే ప్రేయసి కొరకు నేను పడుతున్న ఆందోళన కొంతైనా తగ్గగలదు.''

2 అపరిమితమైన అసూయగలిగిన ప్రేమికుడు గాలిబ్, తన ప్రియురాలితో అంటున్నాడు–''నీవు నన్ను హత్యకావించినావు. సరే, బాగానే చేసినావు. కాని ఇప్పుడు నన్ను నీ వీధిలో మాత్రం సమాధిచేయక వేరే యెక్కడైనా సమాధిచేయించు. ఒక వేళ నీ వీధిలో నా సమాధి నిర్మిస్తే నీవు యిక్కడనే ఉంటావని అందరికి తెలిసిపోయి నిన్ను ప్రేమించడానికి, నీ కటాక్షవీక్షణాన్ని పొందడానికి యింకెందరో వచ్చే ప్రమాదం ఉన్నది.''

ఇది కవి బాధ ఈ బాధలోని అసూయ సుస్పష్టం.

3 ''ఓ ప్రేయసీ, ఈ రోజు నీవు నాకు మదిర అదిస్తున్నావు అందువలన, సాఖీగానిగౌరవాన్ని నిలుపుకొని నాకు తనివి తీరా అందించు నీవు సాఖీవైనప్పుడు ఎవ్వడూ అసంతృప్తుడు కాకూడదు. అదే నీకు గౌరవం. గొప్పదనం. కొద్దిగానైనా సరే మేము ప్రతి రాత్రి త్రాగుతుంటాము. కాని ఈ వేళ మనసారా త్రాగించు.

4 ''నా మిత్రుడొకతను సిఫారసు చేయగా ఒకనొక వ్యక్తి చేత నా ప్రేయసికి ఉత్తరం వ్రాసి పంపించినాను. అతడు నా ప్రేయసిని చూచి ఆమె ప్రేమికుడై పోయినాడు. ప్రత్యుత్తరం వస్తుందో యేమోనని యెదురు చూస్తున్నాను. కాని ఉత్తరం తీసుకపోయిన వాను లేడు సమాధానమూలేదు''

కవి తన మిత్రునితో అప్పుడు ఈ రెండు చరణాలు అంటున్నాడు.

"నీకు చెప్పవలసింది, నిన్ను అనవలసింది ఏమీ లేదు, కాని, అతడూ, ఆ ఉత్తరాన్ని తీసుకొనిపోయినదూత కలిస్తే మాత్రం అతనికి నానమస్కారం అందించగలవు''.

5 గాలిబ్ తన ప్రేయసితో అంటున్నాడు—''లైలా కొరకు మజ్నూ చేసిన దంతా గూడ నేను నీ కొరకు చేసి చూపించగలను. కాని దీని కొరకు కొంత సంతృప్తి కావలెను. ఇప్పుడైతే నా హృదయంలో ఉన్న తీవ్ర మైన బాధ నన్ను బ్రతుకనివ్వడమే లేదు.''

6 గాలిబ్ మీద సానుభూతి ఉన్న ఒకతను గాలిబ్ ప్రేయసి వీధిలో ఉండే వారిని ప్రార్థిస్తున్నాడు.

'' మీకు ఒకవేళ గాలిబ్ కవి కనుక కనుపిస్తే అతని పరిస్థితి యేవిధంగా ఉన్నదో చూడండి. '' ప్రేమించేముందు అతడు యేవిధంగా ఉండేవాడు, ఇప్పుడు ప్రేమలో పడిపోయిన తరువాత అతని పరిస్థితి యేవిధంగా ఉన్నదో!



1

مدت ہوئی ہے یار کو مہمان کئے ہوئے
جوش قدح سے بزم چراغاں کئے ہوئے
ముద్దత్ హూవీహై యార్‌కో మెహ్మాఁ కియే హువే
జోషె ఖద్హాసె బజ్మె చిరాగాఁ కియె హువే

2

کرتا ہوں جمع پھر جگر لخت لخت کو
عرصہ ہوا ہے دعوت مژگاں کئے ہوئے
కర్తాహూఁ జమ ఫిర్ జిగరె లఖ్త్‌లఖ్త్‌కో
అర్సా హూవాహై దావతె మిజ్గాఁ కియె హువే.

3

پھر وضع احتیاط سے رُکنے لگا ہے دم
برسوں ہوئے ہیں چاک گریباں کئے ہوئے
ఫిర్ వజయె ఎహ్తియాత్‌పె రుక్నేలగాహై దమ్
బర్సోఁ హువేహైఁ చాక్ గరేబాఁ కియే హువే

4

مانگے ہے پھر کسی کو لب بام پر ہوس
زلف سیاہ رخ پہ پریشاں کئے ہوئے
మాంగేహై ఫిర్ కిసీకో లబెబామ్ పర్ హవస్
జుల్ఫె సియాహ్ రుఖ్‌పె పరేషాఁ కియె హువే

5

چاہے ہے پھر کسی کو مقابل میں آرزو
سرمہ سے تیز دشنۂ مژگاں کئے ہوئے
చాహేహై ఫిర్ కిసీకో ముఖాబిల్ మెఁ ఆర్జూ
సుర్మెసె తేజ్ దష్నయె మిజ్గాఁ కియె హువే

6
اک نو بہار ناز کو تاکے ہے پھر نگاہ
چہرہ فروغ مے سے گلستاں کئے ہوئے
ఎక్ నౌ బహారె నాజ్‌కో తాకేహై ఫిర్ నిగాహ్
చెహెరా ఫరోగ్ మయ్‌సె గులిస్తాఁ కియె హువే.

7
پھر جی میں ہے کہ در پہ کسی کے پڑے رہیں
سر زیر بار منت درباں کئے ہوئے
ఫిర్ జీమెఁహైకె దర్‌పెకి సీకే పడే రహేఁ
సర్ జేరెబారె మిన్నతె దర్బాఁ కియె హువే

8
جی ڈھونڈتا ہے پھر وہی فرصت کے رات دن
بیٹھے رہیں تصور جانان کئے ہوئے
ఢూండ్తాహై ఫిర్ వహీ ఫుర్సత్‌కె రాత్‌దిన్
బైఠేరహేఁ తసవ్వురె జానాఁ కియె హువే

9
غالب ہمیں نہ چھیڑ کہ پھر جوش اشک سے
بیٹھے ہیں ہم تہیہ طوفان کئے ہوئے
గాలిబ్ హమేఁన ఛేడ్‌కె ఫిర్ జోషె అష్క్‌సే
బైఠేహైఁ హమ్ తహియ్యయె తూఫాఁ కియె హువే.



1 ఆమెకు అతిథ్యమిచ్చి పలునాళ్లైంది. మదిరాస్వాదనంచేస్తూ జేగీయమా నంగా కాలువుతీరి చాలా కాలమైంది.

ఒకప్పుడు తానెంతో వైభవోపేతంగా జీవితంగడుపుతూ ఉండే వాడని ధ్వని.

2 ‘‘చాల రోజులనుండి నా కనురెప్పలు ఆరిపోయి ఉన్నవి. నా కాలేయం నుండి వీటికి రక్తం ప్రసరించగా అవి యెప్పుడూ తడిగా ఉండేవి. కాని ప్రణయం నా కాలేయాన్ని తునకలు తునకలు చేసివేసింది ఇప్పుడు రెప్పలకు ప్రసరించడానికి రక్తం యేది?! అయినా, యీ విధంగా నెత్తురు తడిలేకుండా మాత్రం నా రెప్పలను యెన్ని రోజులని ఉంచగలను. నా కాలేయపు ముక్కలన్నిటిని పోగుజేసి జోడిస్తున్నాను. ఆపైన మళ్లీ రక్తప్రసరణం ప్రారంభం కాగలదు’’

3 ‘‘నేను చాల జాగ్రత్తగా జీవితం గడుపుతున్నాను. కాని ఈ బ్రతుకు తీరు నాకు చాల భారమైపోయి ప్రాణం ఉక్కిరి బిక్కిరై పోతున్నది. నేను ప్రేమకు దాసుడిని. స్వేచ్ఛగా బ్రతికి యిష్టం వచ్చింది చేసేవాడిని, రొమ్ము్మచించుకొని, పిచ్చిపిచ్చిగా తిరుగుతూ యెన్ని పాట్లనైనా పడవలె నని ఉంటుందినాకు. కాని సభ్యత అనే సంకెల నన్ను ఆపివేస్తూ ఉంటుంది. ఇక పైన ఆగడం మాత్రం దుస్తరం. రొమ్ము్మచించుకొనక కొన్ని సంవత్సరాలైనా అయినట్టున్నది. ఇక మాత్రం నేను ఆగబోను’’.

4 ‘‘తిరిగి ఆ మేడ మీద యెవరైనా నిల్చొని ఉండగా చూడవలెనని మనసు ఉబలాటపడుతున్నది. తుమ్మెదలవంటి ముంగురులు ఆమె ముఖం మీద చెదరి ఉండగా చూడవలెనని ఉన్నది నాకు.’’

తన ప్రేయసి యింతకు ముందుగూడ ఈ విధంగా నిల్చొని ఉండగా కవికి కన్నుల విందు జరిగింది. తిరిగి అదే నయనానందం కావాలని కవి కోరుకుంటున్నాడు.

5 " నా ప్రేయసి మళ్ళీ నా ముందు వచ్చి కూర్చోవాలని నా అభిలాష. ఆమె రెప్పలు కాటుకతో తీర్చి దిద్దబడి పదునుపెట్టబడిన కత్తుల వంటివిగా ఉండవలెనని నా ప్రగాఢవాంఛ "

6 "మదిరను సేవించిన తరువాత ఆమైకంతో గులాబి పుష్పంవంటి ముఖాన్ని కలిగి ఉండే మదవతిని, జవరాలిని, నా ప్రేయసిని మళ్ళీ మళ్ళీ చూడాలని నా చూపులువ్విళ్లూరుతున్నాయి.

7 "ప్రేయసి ఇంటిముందు కాపలాగా ఉండే బంట్రోతు అనుగ్రహం నా మీద ఉండునట్టుగా ప్రేయసి ద్వారం ముందే పడి ఉండాలని నాకు తిరిగి కోరిక కలుగుతున్నది. కాపలావాని అనుగ్రహం యెందుకంటే అతడు ప్రియుడిని ప్రేయసి ద్వారం ముందు నిలువనీయడు. అందువలన ప్రియుడు అతణ్ణి బ్రతిమలాడవలసి వస్తున్నది. బ్రతిమిలాడితేగాని అతడు ఊరుకోడు; ప్రేయసి ఇంటిముందు కనీసం యేదో ఒక మూలలోనైనా పడి ఉండడానికి అనుమతిస్తాడు."

8 ప్రేమలో గడిచిపోయిన రోజులను జ్ఞాపకం చేసుకొని గాలిబ్ కవి తల్లడిల్లిపోతున్నాడు. ఈ పంక్తులలో ఆయన వ్యక్తపరచిన ఆందోళన యితరులకు గూడ ఆందోళన కలిగించక మానదు.

తిరిగి అవే తీరికగల దివారాత్రాలు లభ్యమయి, ప్రణయం తప్ప వేరే పని లేకుండా యెల్లప్పుడు ప్రేయసినే ఊహించుకుంటూ ఆమె ధ్యానంలోనె ఉండిపోతే ఎంత బాగుండేది?

9 గాలిబ్! నన్ను కవ్వించకు, విసిగించకు. దుఃఖోద్వేగంతో ఉన్నాను ఆమె నన్ను ఆరటపెట్టి నా గుండెలో తుఫాను రగుల్కొలిపింది. ఇప్పుడు రెచ్చగొట్టితే ఆ తుఫాన్ ఉవ్వెత్తుగ ఎగసి విజృంభిస్తుంది.



بوئے گل نالۂ دل دود چراغِ محفل                1
جو تیری بزم سے نکلا سو پریشاں نکلا

బూయెగుల్ నాలయె దిల్ దూదె చిరాగే మహెఫిల్

జోతేరీ బజ్మ్‌సె నిక్లాసో పరేషాఁ నిక్లా

గాలిబ్ కవి ఈ చరణాలలో ప్రేయసి మందిరాన్ని వర్ణిస్తున్నాడు. మందిర మంతా పూవులతో అలంకరించబడి ఉన్నది; ప్రియులు యెందరో ప్రోగై ఉన్నారు; దీపాలు ప్రకాశిస్తున్నవి. గాలిబ్ ఈ హంగులన్నీ చూసి ఊరుకోడు. వాటి పరిణామాలను గురించి ఆలోచించుస్తుంటాడు.

పూవులన్నీ వాటి సువాసనలను వెదజల్లుతాయి. చల్లని గాడ్పులు ఆసువాసనలను వెంటతీసుకొని ప్రసరిస్తుంటాయి-ప్రియులందరు ప్రేయసి సౌందర్యాన్నిచూసి తాళలేక పిచ్చి పిచ్చి కేకలను వేస్తుంటారు. ఆ మందిరంలో ప్రియుల మొరలు గూడ వినబడుతుంటాయి. చివరకు దీపాల పొగలు గూడ వంకరలు తిరుగుతూ ఉక్కిరిబిక్కిరై పోతూ ఉంటవి. సువాసన, మొరలు, దీపధూపాల ఆందోళనను ప్రేయసి సభతో జోడించి కటువైన ఒక యదార్థం మీద ఉన్న అందమైన యవనికను అలవోకగా లాగివేస్తున్నాడు కవి. ప్రేయసి మందిరంలోనికి వచ్చిన ప్రతివాడు, ప్రతి వస్తువు ఆందోళనచెంది తల్లడిల్లుతూ తిరిగి రాక తప్పదని కవి అభిప్రాయం.

دریائے معاصی تنک آبی سے ہوا خشک                2
میرا سرِ دامن بھی ابھی تر نہ ہوا تھا

దర్యాయె మఆసీ తునక్ ఆబీసె హువా ఖుష్క్

మేరా సరె దామన్ భీ తర్‌న హువాథా

పాపప్రవంతిలో నా చేలాంచలం కొంచెమైనా తడిసిందో తడవలేదో ఆ నదిలోని నీరంతా ఇంకి పోయింది. నేను చేసిన పాపాల ముందు ఆపాప ప్రవంతి ఏపాటిది ?

పాపప్రవంతి; అసంఖ్యాకములైన పాపాలు.అనిభావం.

3
شمع بجھتی ہے تو اس میں سے دھواں اٹھتا ہے
شعلۂ عشق سیہ پوش ہوا میرے بعد
షమా బుఝ్తీహైతో ఇస్మేఁసె ధువాఁ ఉఠ్తాహై
షోలయె ఇష్క్ సియాహ్ పోష్హువా మేరే బాద్

నా మరణం తరువాత ప్రణయదీపం తన సంతాపాన్ని ప్రకటిస్తున్నదేమో? నల్లని పొగలు దాన్ని ఆవరించుకున్నవి.

సంతాపాన్ని ప్రకటించవలసి వచ్చినప్పుడు నల్లని దుస్తులు ధరిస్తారు.

4
ہر چند ہو مشاہدۂ حق کی گفتگو
بنتی نہیں ہے بادہ و ساغر کہے بغیر
హార్ చంద్హో ముషాహిదయె హక్‌కి గుఫ్తగూ
బన్తీనహీఁహై బాదవొ సాగిర్ కహే బగైర్

కవిత్వానికి అనివార్యమైన లక్షణాలున్నాయి వివిధ భావాలను ప్రకటించవలసివచ్చినప్పుడు ఆ లక్షణాలు సామగ్రి అయిపోతవి.

పరాత్పరుని సాక్షాత్కారాన్ని గూర్చి చెప్పవలసివచ్చినా, మదిరను చషకాన్ని పరిస్తావించక తప్పదు. ఆ ప్రస్తావన రాకపోతే భావాలకు నిండు దనంరాదు.

ప్రఖ్యాత పారసీ కవి హాఫిజ్ షిరాజీ ... ...

"మాదర్ ప్యాల అక్సెరుఖెయార్ అయెం
అయె బేఖబర్ జెలజ్జెతె షుర్బెముమేమా"

పాన పాత్రికలో ప్రేయసీవదన ప్రతిబింబం సాక్షాత్కరిస్తుంది. ఆ సందర్శనాభిలాషతో నేను నిరంతరం మదిరాపానం చేస్తుంటాను. ఈ యాథార్థ్యం తెలియనివారు నేను కేవలం నిషాకోసం త్రాగుతున్నానని అనుకుంటారు. మధువుకూ పాత్రికకూ నేను అతీతంగా ఉన్నప్పుడు ఏకాంతంలో ప్రేయసీ ధ్యానంలోనే ఉంటానని వాళ్లకు తెలియదు.

ان ابلوں سے پاوں کے گھبرا گیا تھا میں 5
جی خوش ہوا ہے راہ کو پر خار دیکھکر
ఇన్ ఆబ్లోం సె పావుం కె ఘబ్రా గయాథా మైం
జీ ఖుష్ హువాహై రాహ్‌కో పుర్‌ఖార్ దేఖ్‌కర్

ప్రేమతో పిచ్చిలో పడిపోయి అడవులన్నీ తిరుగగా కాళ్లకు బొగ్గ లొచ్చినవి. ఈ బొగ్గలకు చికిత్స యేమిటి అని నేను చింతిస్తు న్నాను ఇంతలో ఎదురుగా ఉన్న త్రోవ మీద దృష్టిపడ్డది; ఈ దారిలో అన్నీ ముండ్లే. ముండ్లను చూసి సంతృప్తిపడ్డాను.

ఈ ముండ్లు కుచ్చుకొని బొగ్గలు చితికిపోగలవని యీ సంతృప్తి. ప్రేయసి కలిగించే ఇబ్బందులను గురించి కవి యీ చరణాలలో వర్ణిస్తు న్నాడు. ఒక్క యిబ్బందికాదు అనేకమైన కష్టాలను ప్రేయసి కల్గిస్తుందని కవి యిందులో అంటున్నాడు. అయినప్పటికీ, ఈ యిబ్బందులన్నింటినీ భరించడానికి ప్రేమికుడు సిద్ధపడుతాడు ప్రేమికునికి ఉండే సహనాన్ని గురించి ఎక్బాల్ కవి గూడా ఒక చోట యీ విధంగా వ్రాసినాడు.

ఇలాజె దర్ద్ మేం భీ దర్ద్‌కి లజత్‌పె మర్తాహూం
జొథే ఛాలోం మెం కాంటె నోకె సోజన్ సె నికాలేహైం.

ప్రేమికుడు బాధలో ఒక విధమైన ఆనందానుభూతిని (మజాను) సంమోహంతో అన్ని బాధలను ఓర్చుకుంటాడు. ఆయన ఒక ఉదాహ

రణను పేర్కొన్నాడు ప్రేమికుని కాళ్లకు బొగ్గలొచ్చినవి. ముండ్ల మీద నడిచేసరికి ఆ ముండ్లన్నీ బొగ్గలలో యిరుక్కొన్నవి. ఈ బాధలన్నీ ఈ విధంగా ఉండగా బొగ్గలలో ఇరుక్కొన్న ముండ్లను సూదులతో తీయ డానికి పూనుకుంటున్నాడు ప్రేమికుడు; యీ విధంగానైనా బాధ తగ్గు తుందేమోనని. ఇదీ ప్రేమికునికి ఉండే ఓపిక. సహనం అని అంటున్నాడు అల్లామా ఎక్బాల్ కవి.

6

مہرباں ہو کے بلا لو مجھے چاہو جس وقت

میں گیا وقت نہیں ہوں کہ پھر آ بھی نہ سکوں

మెహర్బాం హోకే బులాలో ముఝే చాహో జిస్ వఖ్త్

మైం గయా వఖ్త్ నహీం హూంకె ఫిర్ ఆభీన సకూం

ఎంతో కోపంతో ప్రేయసి నన్ను తన మందిరాన్నుండి బయటికి గెంటి వేయించింది. కాని ప్రేమికునికి మాత్రం ప్రేయసి సన్నిధిలో తప్ప మరొక చోట శాంతిలేదు. ప్రేయసి మందిరం తప్పితే అతనికి వేరేచోటు లేదు. అందువలన ప్రేమికుడు ప్రియసితో అంటున్నాడు.

"నీ కోపం తగ్గి నీకు నాపైన దయకలిగినప్పుడు నాకు మళ్లీ ఆజ్ఞ ఇస్తే నేను తిరిగి రాగలను. పిలిచిన తరువాత రానని అనుకోవద్దు. ఇది ఎన్నటికీ జరుగదు. రాకుండా ఉండటానికి నేనేమీ గడచి పోయిన కాలాన్నికాదు. నేను ప్రేమికుణ్ణి. నీ కటాక్షవీక్షణాన్ని ఒకసారి ప్రసరింప జేసి ఆజ్ఞాపిస్తే క్షణంలో నీ సన్నిధికి చేరుకోగలను"

7

بنا کر فقیروں کا ہم بھیس غالب

تماشائے اہلِ کرم دیکھتے ہیں

బనాకర్ ఫకీరోంకా హమ్ బేస్ గాలిబ్

తమాషాయె అహ్లె కరమ్ దేఖ్తే హైం

నేను బిచ్చగాని వేషం వేసినాను. ఈ వేషంతో, దయగలవారిని యెందరినో కలుసుకొనడం సంభవిస్తుంది. ఇతరుల దయాదాక్షిణ్యాలకులోను

కొవలసివచ్చిందిగదా అన్న చింత లేదునాకు. ఎందుకంటె వదాన్యులుగా లోకంలో చెలామణి అవుతున్న వాళ్ల వింత వ్యవహారాలను ధోరణులను. చూడగలుగుతున్నాను.

8 قاصد کے آتے آتے خط اک اور لکھ رکھوں
میں جانتا ہوں جو وہ لکھینگے جواب میں
ఖాసిద్ కె ఆతే ఆతే ఖత్ ఎక్ ఔర్ లిఖ్ రఖూఁ
మైఁజాన్తాహు జో వొహ్ లిఖేంగే జవాబ్ మేఁ.

ఒక ఉత్తరం వ్రాసి దానిని ఒక దూతద్వారా ప్రేయసికి పంపించినాడు. ప్రత్యుత్తరంగా ఆమె యేమి వ్రాస్తుందో తెలుసు ఆ ప్రియునికి. అతడు ఆ మాత్రం ఉహించుకోగలడు. ఆ ఊహ ప్రకారం దానికి సమాదానంగా మళ్లీ ఒక ఉత్తరం వ్రాయడానికి కూర్చుంటాడు ప్రేమికుడు. పోయిన దూత సమాధానం తెచ్చిన తరువాత సమాధానం వ్రాసి పంపించడంలో ఆలస్యం అవుతుందేమోనని మొదట ఒక ఉత్తరాన్ని వ్రాసి పెట్టుకుంటాడు. ఇదీ ప్రేమికుని ఆతురత.

9 رو میں ہے رخش عمر کہاں دیکھیے تھمے
نے ہاتھ باگ پر ہے نہ پا ہے رکاب میں
రౌమెఁ హై రఖ్షె ఉమ్ర కహాఁ దేఖియె థమే
నై హాథ్ బాగ్‌పర్ హై నపాహై రికాబ్ మెఁ

ఈ పంక్తులు రెండు చాల ప్రసిద్ధిపొందినవి. వీటిలో మానవుని జీవితాన్ని ఒక ఉదాహరణతోవివరించినాడు. జీవితాన్ని కవి ఒక గుర్రంతో పోల్చినాడు. మానవుడు దీని మీద సవారీ చేస్తాడు. ఆ గుర్రం ఉరుకుతూ ఉంటుంది. కళ్లెం అతని చేతిలో లేదు. కాళ్లు జీనులో గట్టిగా పట్టుకలిగిలేవు. అదుపు లేకుండా గుర్రం మీద పరుగుతీస్తున్నాడు అతడు ఆగుర్రం మీద పొందికతో కూర్చుండనూలేడు. దాన్ని అదువులోగూడ పెట్టుకోలేడు. అతడిక పూర్తిగా ఆ గుర్రం అధీనంలోనే; గుర్రం దానంతట అది యెక్కడ ఆగితే,

అక్కడనే ఆతని యాత్ర ముగుస్తుందన్నమాట.

గాలిబ్ అతిసుందరంగా, అత్యంత గూఢంగా వ్యక్తపరచిన యీ భావాన్ని చుక్తాయీ అనే ప్రసిద్ధ చిత్రకారుడు తన కుంచెతో అత్యద్భుతంగా, అతి మనోహరంగా చిత్రీకరించాడు. ఆ చిత్రంలో మనకు కన్పించే దృశ్యం యిది-ఒక నది ప్రవహిస్తుంటుంది. ఆ నదిలో, కమలములో వెలుగుతున్న చిన్న దీపం ఒకటి సాగిపోతుంటుంది. ఈ భావాన్ని విభిన్నమైన పద్ధతుల్లో విశేషమైన ప్రతిభతో వెల్లడించిన గాలిబ్, చుక్తాయ్ యిద్దరూ అభినంద నీయులే. కాని కవి కంటే చిత్రకారుడే యీ భావాన్ని ఎంతో సున్నితంగా, ఆకర్షణీయంగా వ్యక్తపరచినాడని కొందరి అభిప్రాయం.

کم نہیں جلوہ گری میں ترے کوچہ سے بہشت   10
یہی نقشہ والے اسقدر آباد نہیں

కమ్‌నహీం జల్వాగిరీమెం తెరే కూచేసే బహిష్త్
యహీనక్షావాలె ఇస్‌ఖదర్ ఆబాద్ నహీం

స్వర్గంలో ఉన్న తేజస్సుకంటె ఏవిధంగానూ ప్రియురాలి వీధిలోని తేజస్సు తక్కువదిగాదు. ఈ వీధిలో ఉన్న అందం, ఆకర్షణ స్వర్గంలో గూడ ఉంటాయి. ప్రేయసివీధి జనంతో కిటకిటలాడుతూ ఉంటుంది; స్వర్గంలో మాత్రం జనసమ్మర్దం అంతగా ఉండదు.

ప్రేయసి వీధిలో ఉన్న అందం, ఆకర్షణ స్వర్గంలో గూడ ఉందవు అని భావం.

نہ لٹتا دن کو تو کب رات کو یوں بیخبر سوتا   11
رہا کھٹکا نہ چوری کا دعا دیتا ہوں رہزن کو

నలుట్తా దిన్‌కూతో కబ్‌రాత్‌కూ యూం బేఖబర్ సోతా
రహా ఖట్కా న చోరీకా దుఆ దేతాహూం రహెజన్‌కో

పగటి పూటనే నా యింటిలో కనుక దొంగతనం జరుగకపోతే నేను రాత్రి వేళ ఇంత పరవశుణ్ణై పడుకొనకపోయే వాడిని. ఇంట్లో యేమైనా

వస్తువులు ఉంటే నేను ఇంత నిశ్చింతగా నిద్రపోకపోయేవాడిని. ఈ దొంగలకు నేను యెంతో కృతజ్ఞుడిని; ఇంటిలో వస్తువులు యేమీ లేకుండాచేసి నాకు శాంతిని సిద్ధింపజేవినారు. ఇప్పుడు నేనిక చింతలేకుండా సుఖంగా నిద్ర పోగలను.

12
جب میکدہ چھٹا تو پھر اب کیا جگہ کی قید
مسجد ہو مدرسہ ہو کوئی خانقاہ ہو
జబ్ మైకదా ఛుటాతో ఫిర్ అబ్ క్యాజగేకీ ఖైద్
మస్జిద్ హో మదర్సాహో కోయీ ఖాన్ఖాహ్ హో

'పానశాలలో నేను మధువును సేవించేవాడిని నేను యిక మీద పానశాలకు వెళ్లగూడదని ఆంక్ష. పానశాలలో ప్రవేశం దొరకనప్పుడు నాకిక సమయం, స్థలం అనే నిర్బంధాలే లేవు ఇక మీదట నేను యెక్కడైనా త్రాగగలను. అది మందిరమే కానీయండి, మసీదే కానీయండి, పాఠశాలే కానీయండి యెక్కడనైనా తాగగలను.''

పైమూడు ప్రదేశాల్లో గూడా మదిరను సేవించరూడదు మదిరను త్రాగగల ప్రదేశానికి నేను పోగూడనప్పుడు దానిని త్రాగరాని ప్రదేశాలలోనే నేను త్రాగగలను.

13
سیکھے ہیں مہ رخوں کے لئے ہم مصوری
تقریب کچھ تو بہر ملاقات چاہئے
సీఖే హైఁ మహ్ రుఖోఁ కె లియె హమ్ ముసవ్విరీ
తఖ్రీబ్ కుఛ్ తో బహ్రె ములాఖాత్ చాహియె

''నేను చిత్రలేఖనం నేర్చుకొన్నాను. ఈ కళ ద్వారా మనం చక్కని, చిక్కని యువతుల ఇండ్లలోనికి ప్రవేశించవచ్చు. ప్రేయసి తన చిత్రరచన కొరకు నన్ను పిలిపించగలదు. ఈ సాకుతో నేను ప్రేయసి ఇంటిలో ప్రవేశించవచ్చు''

14 ہر اک مکاں کو ہے مکیں سے شرف اسد
مجنوں جو مر گیا ہے تو جنگل اُداس ہے
హర్ ఎక్ మకాఁకొ హై మకీఁసె షర్ఫ్ అసద్
మజ్నూఁజొ మర్ గయా హైతొ జంగల్ ఉదాస్ హై

ఇంటి శోభ అందులో నివసించేవారిని బట్టి ఉంటుంది. లైలా ఎడబాటు వల్ల కలిగిన విరహంతో మజ్నూ అడవుల వెంట తిరిగినప్పుడు మజ్నూ వ్యక్తిత్వాన్నిబట్టి అడవుల శోభ గూడ ఎంతో హెచ్చింది. ఒక గృహస్తు చచ్చిపోతే ఇల్లు ఏవిధంగా పాడుబడిపోతుందో ఆదేవిధంగా మజ్నూ చని పోయాక అడవిలోని అందమే పోయింది.

15 ہستی کے مت فریب میں آجائیو اسد
عالم تمام حلقۂ دام خیال ہے
హస్తీకె మత్ ఫరేబ్ మెఁ ఆజాయియో అసద్
ఆలమ్ తమామ్ హల్ఖయె దామెఖియాల్ హై

ఈ పంక్తులలో గాలిబ్ వైరాగ్యభావాన్ని, వేదాంతాన్ని ప్రవచిస్తు న్నాడు.

జీవితం ఒక మోసం. ఈ మోసానికి లోనవగూడదు. ఈ ప్రపంచ మంతా కేవలం ఊహామాత్రమైన భ్రమలవలయం మాత్రమే. ఇందులో ఏదీ యథార్థం కాదు. అన్ని హంగులను చూపించేది ఆలోచన మాత్రమే. ఈ ఆలోచన సంతోషాన్ని దుఃఖంగాను, దుఃఖాన్ని సంతోషంగాను మార్చగలదు. అందువలన ఈ జీవితాన్ని ఎన్నడూ నమ్మవద్దు.

16 مئے سے غرض نشاط ہے کس روسیاہ کو
اک گونہ بیخودی مجھے دن رات چاہیئے
మయెసె గర్జ్ నిషాత్ హై కిస్ రూసియాహ్‌కో
ఎక్‌గూన బేఖుదీ ముఝె దిన్‌రాత్ చాహియె

నేను కేవలం సుఖసంతోషాల కొరకు మాత్రమే త్రాగుతుంటానని ప్రజలు పొరపాటు పడుతుంటారు. యథార్థంగా చెప్పాలంటే నేను కేవలం సుఖసంతోషాలకొరకు మాత్రమే మదిరను సేవించే పాపాత్ముడిని కాదు. దివారాత్రాలు ఏదోకొంత పరవశంగాఉండవలెనన్న బాధతోమాత్రమే యీపాన సేవ చేస్తుంటాను. తద్వారా ప్రపంచంలోని బాధలన్నింటినీ మరచిపోయి తదేకధ్యానంతో కవితా రచన చేయగలగడానికే నా ఈ ప్రయత్నం.

17 بیٹھا ہے جو کہ سایۂ دیوار یار میں
فرماں روائے کشور ہندوستان ہے

బైఠా హై జో కె సాయయె దివారె యార్ మేం
ఫర్మాం రవాయె కిష్వరె హిందూస్తాం హై

ఈ చరణాలలో గాలిబ్ మహాశయుని అతిశయోక్తి ఆహ్లాదకరమైన అందాలను, ఒయ్యారాలను అలతిఅలతి చెలువాలను కురిపిస్తున్నది. ఈ కవితా రీతి ఆయనకే చెల్లివచ్చింది. అయన భావాన్ని చవి చూడండి.

ప్రేయసి ఇంటి గోడ నీడలో ప్రియుడు కూర్చొని తాను భారత దేశాధీశుని కంటె గొప్పవాణ్ణని గర్విస్తున్నాడు.

నాటి ఢిల్లీశ్వరుని రాజ్యం ఎర్రకోట వరకే పరిసీమితమైయుండేది. కాని ఆ బహద్దుర్‌షా తన్ను తాను సకలభారతావనికి సామ్రాట్టునని అనుకునే వాడు ఇది కేవలం మిథ్యాభావం అని గాలిబ్ వ్యంగ్యంగా అంటున్నాడు.

18 یار سے چھیڑ چلی جائے اسد
گر نہیں وصل تو حسرت ہی سہی

యార్‌సే ఛేడ్ చలీ జాయే అసద్
గర్ నహీం వసల్‌తొ హసరత్‌హి సహీ

"ప్రేయసి సమాగమం లభించకపోతే పోయింది. నేను మాత్రం ఆమెను వదలిపెట్టలేను. ఏమీ ఆటంకం లేకుండా నేను ఆమెతో సంబంధాలను కొనసాగించుకోగలను; ఆమెను కవ్విస్తూ ఆమెను రెచ్చగొట్టుతుంటాను. సమాగమం ప్రాప్తించకపోతే ఆ కోరికతోనె బ్రతికి ఉండగలను. నాకు. ప్రేయసికి మధ్య సంబంధాలు నిలచి ఉండడానికి ఏదో ఒక వ్యవహారం ఉండవలసిందే."

19 اُگ رہا ہے در و دیوار پہ سبزہ غالب
ہم بیاباں میں ہیں اور گھر میں بہار آئی ہے

ఉగ్ రహాహై దరోదీవార్‌పె సబ్జ గాలిబ్
హమ్ బయాబాఁమేఁ హైఁ ఔర్ ఘర్‌మేఁ బహార్ ఆయీహై

ఈ పంక్తులు ఉర్దూ భాషతో పరిచయం ఉన్న వారందరి నాలుకల మీద సతతం నాట్యం చేస్తుంటాయి బహుశః ఈ చరణాల్లోని అందమైన భావమే వాటి ప్రఖ్యాతికి ప్రధానమైన కారణం కావచ్చు.

"ప్రేమలో పడి. పిచ్చి వాణ్ణి అయిపోయి నేను అగవుల పాలయినాను. నేను ఇంటిలో లేనప్పుడు ఇంటి నిండా పచ్చని గడ్డి మొలిచింది. పచ్చని గడ్డిని చూచి తల్లడిల్లి పోయినాను. నేనేమో అడవిలో ఉన్నాను. నా ఇంటిలో నేమో వసంతం ప్రవేశించింది".

ఇంటి నిండా గడ్డి మొలవడం శిథిలమైన స్థితిని తెలియజేస్తుంది అయినా ఇక్కడ గాలిబ్ సున్నితంగా తనకు కలిగిన దుఃఖాన్ని ప్రకటిస్తున్నాడు.

20 دیکھنا تقریر کی لذت کہ جو اس نے کہا
میں نے یہ جانا کہ گویا یہ بھی میرے دل میں ہے

దేఖ్నా తఖ్రీర్‌కి లజ్జత్‌కె జో ఉస్‌నే కహా
మైఁనే యెహ్ జానాకె గోయా యెహ్‌భీ మేరే దిల్ మేఁ హై.

ఎంతో మృదువుగా, ఎంతో వర్మగర్భంగా ఎంతో ప్రీతికరంగా నా హృదయంలోని భావాలను ఆమె ప్రకటిస్తున్నట్లు తోస్తున్నది.

21 گرچہ ہے کس کس بُرائی سے ولے بایں ہمہ
ذکر میرا مجھ سے بہتر ہے کہ اس محفل میں ہے

గర్చెహై కిస్ కిస్ బురాయీసె వలే బాయీఁ హమా
జిక్ర్ మేరా ముఝ్‌సె బెహ్తర్ హైకె ఉస్ మహెఫిల్ మేఁ హై

"ప్రేయసి వద్ద నా ప్రసక్తి వచ్చినప్పుడు ఎప్పుడూ నాలోపాలను గురించే చెప్పడం జరుగుతుంది. మంచో, చెడ్డో నా ప్రసక్తి మాత్రం వస్తూ ఉంటుంది. ఈవిధంగా నాకంటె నాప్రసక్తే యెంతో అదృష్టం. ఎందుకంటే కనీసం ఆమె వద్దకి నాప్రసక్తైనా పోగలుగుతున్నది. నాకు ఆ అదృష్టం గూడా లేదు."

22 اس انجمن ناز کی کیا بات ہے غالب
ہم بھی گئے واں اور تیری تقدیر کو رو آئے

ఉస్ అంజుమనె నాజ్‌కి క్యా బాత్ హై గాలిబ్
హమ్‌భీ గయెవాఁ ఔర్ తెరీ తఖ్దీర్‌కో రో ఆయే.

'నేను ప్రేమలోపడి నాశనం కావడం చూడలేక నా మిత్రుకు ఒకతడు నా పేృయసితో నన్ను గురించి మాట్లాడుతానని పెళ్లినాడు. కాని వెళ్లి వచ్చిన తరువాత జరిగింది ఏమిటి! నా ప్రేయసి చాల అందమైనదని, ఆమె మంది రాన్ని గురించి తాను చెప్పనేలేనని, నాకు ఆమె సమాగమం లభించదని, నేను అందుకు యోగ్యుడను కానని, నేను పొందలేని ప్రేయసిని ఒక దానిని ప్రేమించి అనవసరంగా చీకాకులపాలై పోతున్నానని, నా పట్ల కేవలం సానుభూతిని ప్రకటించడం తప్ప మరేమీ చేయలేనని అన్నాడు'

23 بے خودی بے سبب نہیں غالب
کچھ تو ہے جس کی پردہ داری ہے

బేఖుదీ బేసబబ్ నహీఁ గాలిబ్
కుఛ్‌తో హై జిస్కీ పర్దదారీ హై

గాలిబ్ కవి తనలో తానులేడు; ఎంతో పారవశ్యంలో ఉన్నాడు. ఏదో ఇబ్బంది, దుఃఖం ఉంది అతనికి. అందువల్లనే ఈ విధంగా పరధ్యానంలో ఉంటాడని చూసేవాళ్లందరు అనుకుంటారని భయం. ఎవరిని గురించి ఈ పరధ్యానం? అని అడుగుతారేమోనని గూడ అయన భయం. అందువల్ల యీ కృత్రిమ పారవశ్యం ఒక రహస్యాన్ని దాచిపెట్టే ముసుగన్నమాట.

గాలిబ్ కవి అకారణంగా పరధ్యానంలో ఉండేవాడు మాత్రం కాదు అని దీని భావం.

24

پنہاں تھا دام سخت قریب آشیانے کے
اُڑ نے نہ پائے تھے کہ گرفتار ہم ہوئے

పిన్హాఁ థా దామె సఖ్త్ ఖరీబ్ ఆష్యాఁకె
ఉడ్నేన పాయెథేకె గిరఫ్తార్ హమ్ హువే.

"నా గూటినుంచి నేను ఎగిరిన వెంటనే వలలో చిక్కుకొని పోయి నాను. వేటగాడు నా గూటికి సమీపంలోనె వలను వేసి ఉంచినాడు. అందు చేత నేను ప్రపంచ యాత్ర చేయలేక పోయినాను. గూటినుండి వెళ్లి వలలో చిక్కుకున్నాను. నేను జీవితంలో అడుగు పెట్టేసరికే అన్ని ఇబ్బందులు మొదలైనవి. నేనసలు స్వేచ్ఛగా జీవించడం అంటే యేమిటో తెలుసుకొన లేక పోయాను."

1857లో భారతీయుల తిరుగుబాటు–వైఫల్యం వ్యంగ్యంగా సూచింపబడ్డవి.

25

نے تیر کمان میں ہے نہ صیاد کمیں میں
گوشہ میں قفس کے مجھے آرام بہت ہے

నతీర్ కమాన్‌మెఁ హై నసయ్యాద్ కమీమెఁ
గోషేమెఁ ఖఫస్‌కె ముఝె ఆరామ్ బొహత్ హై

పంజరంలో చిక్కుని ఉన్న పక్షి తన్నుతాను ఓదార్చుకొని సంతృప్తి పడుతున్నది–జీవితమంటే ఇదే, ఇదే దాని పరమావధి.

''నేనీ పంజరంలో చాల ప్రశాంతంగా ఉన్నాను. తోటలో ఉన్నప్పుడు ఎప్పుడూ వేటగాళ్ల. భయమే. ఈ పంజరంలో ఉంటేమాత్రం ఏభయమూలేదు.''

ఇది జానిస జీవితం మీద గాలిబ్ ప్రకటించిన తీవ్రవ్యంగ్యం.

26 ایک ہنگامے پہ موقوف ہے گھر کی رونق
نوحۂ غم ہی سہی نغمۂ شادی نہ سہی

ఎక్ హంగామే పే మౌఖూఫ్ హై ఘర్ కీ రౌనఖ్
నౌహాయె గమ్ హీ నహీ నగ్మయె షాదీ న సహీ.

గాలిబ్ కవి వ్రాసిన విషాద గీతికలన్నింటిలోను యిది చాల హృదయ విదారకమైనది. ఇంటిలో సంతోషం ఉంటే అంతా హడావిడిగా ఉంటుంది. ఒక ఇంటిలో యేదైనా పండుగ వంటిది జరిగితే యెంతో అందంగా. ఆనందంగా ఉంటుంది. సంతోష గీతాలతో ఆ యిల్లు కలకల లాడుతూ ఉంటుంది. ప్రియుని ఇంటిలో మాత్రం యిటువంటి వాతావరణం యేర్పడగలదన్న నమ్మకమైనా లేదు.

ఇంటిలో హడావిడి ఉంటేనే సంతోషం – అయితే నేనిక యీ ప్రపంచాన్ని విడిచిపెట్టి పోతాను. నేను చచ్చి పోయిన తరువాత జనులంతా ఏడ్చి ఏడ్చి పెద్ద హడావిడి చేయగలరు; ఈ విధంగా నా ఇంటిలో గూడ సందడి, సంతోషం ప్రవేశించ గలవు. నేను లేక పోతే మాత్రం యేమిటి, నా ఇంటిలో సంతోషం సంబరం తాండవించగలవు గదా.!

27 عشق نے غالب نکما کر دیا
ورنہ ہم بھی آدمی تھے کام کے

ఇష్క్‌నే గాలిబ్ నికమ్మా కర్దియా
వర్నా హమ్‌భీ ఆద్మీథే కామ్ కే

ప్రేమలో పడిపోయినవాడి సోమరితనాన్ని ఈ చరణాల్లో గాలిబ్ కవి చాల చక్కగా వర్ణించినాడు. ప్రేమికుడిని సమర్థిస్తున్నాడు గాలిబ్.

"ప్రేమికుడు తన ప్రేయసిని జ్ఞాపకం చేసుకొంటూ సోమరిగా పడి ఉంటే అతడు ఎందుకూ పనికిరానివాడని అనుకోవద్దు. అతడు మంచి నేర్పు, యోగ్యత ఉన్నవాడు. ఈ పాడు ప్రేమలోపడి అతడు ఏ విషయాన్ని, ఏ పనిని పట్టించుకొవలేక పోతున్నాడు. లేకపోతే ఆయన యెన్నో పనులను చేయగలిగినవాడు. ఇప్పుడు మాత్రం అతనికి పాపం, ఒకటే ధ్యాస! అది ప్రియురాలి ధ్యాస.! అదే ధ్యాసలో ఉంటాడు, లేకపోతే ఆమె వీధిలో తిరుగు తుంటాడు. ఈ ప్రేమే అతనిని సోమరిగా మార్చింది; లేకపోతే అతడు ఎంతో ప్రయోజకుడు, యెంతో పనికి వచ్చేవాడు."

28

کر دیا ضعف نے عاجز غالب
ننگ پیری ہے جوانی میری

కర్దియా జోఫ్‌నే ఆజిజ్ గాలిబ్
నంగె పీరీహై జవానీ మేరీ

ప్రేమ వ్యవహారాల్లోపడి నేను అశక్తుణ్ణి అయిపోయాను. మిసిమివయసులోనే ముదిమి వచ్చింది. ఇది ముదిమేనా! అయితే ముదిమికే అవమానకరం.

29

چاک مت کر جیب بے ایام گل
کچھ ادھر کا بھی اشارہ چاہئے

చాక్ మత్ కర్ జేబ్‌బే అయ్యామె గుల్
కుఛ్ ఉధర్‌కాభీ ఇషారా చాహియే

ప్రేమ కొరకు అనువైన వాతావరణం అత్యవసరం. వసంతంలో గులాబి మొగ్గలువికసించి పూవులైనట్లు ప్రేమికులు గూడా వసంతంలో తమ ప్రేమను పెంచాలి, బాగా మత్తిల్లిపోయి పరవశులైపోవాలి. అకాలంగా యే పని గూడ అభిలషించదగినట్లుగా ఉండదు. పూవులు వికసించే కాలంలో ప్రేమ తీవ్రతరం అయితే అది సమంజసయే. సౌందర్యం ఉబికి వస్తున్నప్పుడు ప్రేమికులకు పిచ్చి లేవకపోతే యేమవుతుందిమరి?

30 غافل ان مہ طلعتوں کے واسطے
چاہنے والا بھی اچھا چاہیے

గాఫిల్ ఇన్ మహ్ తలాతోఁకే వాస్తే
చాహ్నేవాలాభీ అచ్ఛా చాహియే

కొందరు అందమైన అతివల్ని ప్రేమించి సౌందర్యాన్ని మాత్రమే చూసి మురిసిపోతుంటారు. తమను మాత్రం తాము చూసుకోరు. ఇటువంటి ప్రియులతో చెప్పుతున్నాడు గాలిబ్.

'అందంగా ఉండే ప్రేయసి తన ప్రియుడుగూడ అందంగానే ఉండాలని కోరుకుంటుంది.'

31 منحصر مرنے پہ ہو جسکی امید
ناامیدی اسکی دیکھا چاہیے

మున్హసిర్ మర్నేపెహో జిస్కీ ఉమ్మీద్
నా ఉమ్మీదీ ఉస్కీ దేఖా చాహియె

తన ఆశల సాఫల్యం కొరకు జీవితంలో మానవుడు వివిధమైన ఆధారాలను వెతుక్కుంటాడు. ఆశలకు సంబంధించిన ఈ ఆసరాలతోనే, ఆధారాలతోనే అతడు బ్రతుకుతుంటాడు. కాని తన కోరికలన్నింటితో నిరాశచెంది, ఇక కేవలం చావడం ఒక్కటే తన కోరికని అనుకునేవాడు పొందే నిరాశ ఊహించరానిది. జీవితంలో అన్ని ఆశలను వదులుకొని ఇక చావు మాత్రమే శరణ్యమని అనుకునేవారుపొందే నిరాశను కాస్త ఊహించండి.

ఇదే భావాన్ని వెల్లడిచేస్తూ. గాలిబ్ కవికి సమకాలికుడైన జౌఖ్.

''అబ్ తో ఘబ్రాకె యె కహ్తే హైఁకె మర్ జాయింగే
మర్ కేభీ చైన్ నపాయాతొ కిధర్ జాయింగే

కష్టాలకు దుఃఖాలకు ఓడిపోయి చావువస్తే బాగుండేదని పలవిస్తారు. మృత్యువు తరువాత కూడ మనశ్శాంతి చేకూరని పక్షంలో ఎక్కడికి వెళ్ల గలుగుతారు?

32 اسد خوشی سے میرے ہاتھ پاؤں پھول گئے
کہا جو اُس نے ذرا میرے پاؤں داب تو دے

అసద్ ఖుషీ సే మేరే హీథ్ పావు( ఫూల్ గయె
కహాజొ ఉస్నే జరా మేరే పావు( దాబ్‌తొ దే

ఈ చరణాల్లో చిలిపితనం ఎంతగా ఉన్నదో చక్కని అర్థపుష్టి గూడ అంతగానే చిప్పిలు తున్నది.

ప్రేయసి తన కాళ్లను కాస్త ఒత్తమన్నది ప్రియుడితో. ప్రియునికి యీ విషయం చాల సంతోషాన్ని కలిగించింది. సంతోషంతో కాళ్లు, చేతులు ఉబ్బిపోయి కదలకుండా అయిపోయినాడు ప్రేమికుడు అతడులేచి ప్రేయసి కాళ్లు ఒత్తలేకపోయినాడు. ప్రేయసి యెంతో అనుగ్రహించినా ఆ అనుగ్రహంతో లాభం పొందలేక పోయాడు ప్రేమికుడు.

ఇది ఈ గాలిబ్ కవితా ఖండికలో నర్మగర్భితంగా ఉన్న భావసౌరభం.

33 سنبھلنے دے مجھے اے نا امیدی کیا قیامت ہے
کہ دامانِ خیالِ یار چھوٹا جائے ہے مجھ سے

సంభల్నేదే ముఝె అయె నాఉమీదీ క్యా ఖియామత్ హై
కె దామానె ఖియాలె యార్ ఛూటా జాయెహై ముఝ్‌సే

ఇందులో, ప్రేమికుని నైరాశ్యాన్ని హృదయవిదారకంగా వర్ణించినాడు కవి. నిరాశను సంబోధించి అంటున్నాడు కవి.

ఈ విధంగా నన్ను విడువకుండా గురిచూడకు; నాకు కొంతైనా వ్యవధి యివ్వు. ఈ నైరాశ్యాన్ని భరించుకోగల శక్తిని కాస్తనైనా పొందనీ. భరించ రాని ఈ నిరాశలో ప్రేయసిని జ్ఞాపకం చేసుకుంటూ బ్రతికి ఉన్నాను. ఇప్పుడు మాత్రం ఆమెను ఊహించుకోగల శక్తిగూడ లేకుండా పోయింది నాకు, నా నుండి యీ ఆలోచనా శక్తి సైతం దూరమై పోతున్నది. నైరాశ్యంలో ప్రేయ

సిని జ్ఞాపకం చేసుకుంటూ జీవించి ఉండేవాడిని. ఇప్పుడు ఆజ్ఞాపక శక్తి గూడ పోతున్నది ఇది నైరాశ్యానికి పతాకస్థాయి ప్రేయసి సమాగమం అదృష్టం లోనె లేదు. ఆమె స్మృతి, ఆలోచన గూడ నన్ను విడిచి పెట్టిపోతున్నవి. ఇది యెంతటి దురదృష్టం?

34 گو ہاتھ کو جنبش نہیں آنکھوں میں تو دم ہے
رہنے دو ابھی ساغر و مینا میرے آگے
గో హాథ్ కూ జుంబిష్ నహీఁ ఆంఖోంమెఁ తో దమ్ హై
రహ్నేదో అభీ సాగర్ వమీనా మేరే ఆగే

గాలిబ్ కవికి మదిరతో చాల గాఢమైన సంబంధం ఉండేదని వ్యక్త పరిచే పంక్తులు ఇవి.

మధుకలశాన్ని, మధుపాత్రల్ని నాముందే ఉండనీయండి. నా దృష్టిలోని బలంగూడ అంతరించిపోయే వరకు అదే విధంగా ఆ మధుకలశాన్ని, పాత్రల్ని చూస్తూనైనా సంతృప్తి పడతాను. చేతులుచాచి చషకాన్ని అందుకుని త్రాగలేక పోయినా, కన్నులతోనైనా పానంచేసి సృతృప్తి పడతాను.

35 سفینہ جبکہ کنارہ سے آلگا غالب
خدا سے کیا ستم و جور نا خدا کہیے
సఫీనా జబ్‌కే కినారేసే ఆలగా గాలిబ్
ఖుదాసె క్యా సితమ్ వజౌరె నా ఖుదా కహియె

నావలో ప్రవేశించిన తరువాత ప్రయాణ సందర్భంలో నావికుడు ఎంత బాధ పెట్టినాడు! అయినా యేంచేయడం! ప్రయాణం అవసరం గనుక ఊరు కొనక తప్పలేదు; గమ్యాన్ని చేరుకొనవలెను గదా మరి! ప్రయాణంచేసి నదిని దాటిన తరువాత మాత్రం ఆ నావికుడిని యేమంటే యేమి లాభం. అది అనవసరం గూడ. మన ధ్యేయం యేదో పూర్తి అయింది. మన గమ్యానికి మనం చేరుకున్నాం. ఇంకా ఆయనను దూషించడం ఎందుకు?

36 ہزاروں خواہشیں ایسی کہ ہر خواہش پہ دم نکلے
بہت نکلے میرے ارماں لیکن پھر بھی کم نکلے

హజారోఀ ఖ్వాహిషేఀ ఐసీకె హర్ ఖ్వాహిష్‌పె దమ్ నిక్లే
బొహత్ నిక్లే మేరే అర్మాఀ లేకిన్ ఫిర్‌భీ కమ్ నిక్లే

వేనవేలకోరికలున్నాయి నాకు. ఏవొక్క కోరిక తీరిక పోయినా ప్రాణం పోయే అంకపని అవుతుంది. అయినా తీరిన కోరికలకంటే తీరని కోరికలే ఎక్కువున్నాయి.

37 نکلنا خلد سے آدم کا سنتے آئے تھے لیکن
بہت بےآبرو ہوکر ترے کوچے سے ہم نکلے

నికల్నా ఖుల్ద్‌సే ఆదమ్‌కా సున్తే ఆయేథే లేకిన్
బొహత్‌బే ఆబ్రూహోకర్ తెరే కోచేసే హమ్ నిక్లే

భగవంతుని ఆజ్ఞలను పాటించనందువలన ఆదమ్ అనునతనిని యెంతో అవమాన పరచి స్వర్గం నుండి తరిమి వేసినారని ఒక కథ.

''ఆనాడు ఆదమ్‌ను భగవంతుడు తరిమివేసినట్టే ఈ నాడు నన్ను ప్రియురాలు తన వీధినుండి వెళ్లగొట్టినది. ఆదమ్‌కు జరిగిన అవమానం ఏ విధంగా ఉంటుందో యిప్పుడు అర్థం అయింది నాకు. మరొక విధంగా చెప్ప వలెనంటే ఆనాడు ఆదమ్‌కు జరిగిన అవమానం కంటె నాకు జరిగిన యీ అవ మానం యెంతో తీవ్రమైనది.''

38 سچ آپڑی ہے وعدۂ دلدار کی مجھے
وہ آئے یا نہ آئے پہ یاں انتظار ہے

పచ్ ఆపడీహై వాదయె దిల్దార్‌కీ ముఝె
వొహ్ ఆయె యా నఆయె పె యాఀ ఇంతెజార్ హై

39

بیگانگیِ خلق سے بیدل نہ ہو غالب
کوئی نہیں تیرا تو میری جان خدا ہے

బేగానగీయె ఖల్క్ సే బేదిల్ నహో గాలిబ్
కోయీ నహీం తెరాతో మేరీజాం ఖుదాహై

మనుష్యులలోని నిర్దయను, నిర్లక్ష్యాన్ని చిత్రిస్తున్నాడు గాలిబ్

తనలో తానే, అనుకొంటున్నాడు: నీ చుట్టూ ఉండేవారి అలక్ష్యాన్ని చూసి అధైర్యపడకు, నిరాశ చెందకు. ఓ నా ప్రాణమా, నీకు నీవారు ఎవ్వరూ లేనప్పుడు, ఆ భగవంతుడే ఉన్నాడు.

40

کیا فرض ہے کہ سب کو ملے ایک سا جواب
آؤ نا ہم بھی سیر کریں کوہ طور کی

క్యా ఫర్జ్ హైకె సబ్‌కో మిలే ఏక్‌సా జవాబ్
ఆవోనా, హమ్‌భీ సైర్ కరేం కోహె తూర్‌కీ

ఇందులో సంప్రదాయసిద్ధమైన ఒక గాధను ప్రస్తావిస్తున్నాడు గాలిబ్. మూసా భగవంతుడు ప్రసాదించిన ఒక మహాప్రవక్త అని, మహిమాన్వితుడని విశ్వాసం. తూర్ పర్వతము మీద మూసా భగవంతునితో మాట్లాడేవాడని గూడ ప్రతీతి. ఒకనాడు మూసా భగవంతుణ్ణి ప్రత్యక్షంగానకబడుమని పట్టు పట్టాడు. అందుకు భగవంతుడు అంగీకరించలేదు. ఈ సంఘటనను దృష్టిలో పెట్టుకొని గాలిబ్ అంటున్నాడు,

మూసాకు దర్శనం యివ్వక పోయినంత మాత్రాన మరెవ్వరికీ ఆదర్శనం లభించదని ఎందుకు అనుకోవడం! అందరూ ఒకటేనా? రండి మనం గూడ తూర్ పర్వతానికి వాహ్యాళి వెళ్లి వద్దాము.

తనకు దర్శనం దొరుకుతుందని గాలిబ్ ఆత్మవిశ్వాసం.

41 کو وان نہیں پہ وہاں کے نکالے ہوئے تو ہیں
کعبہ سے ان بتوں کو بھی نسبت ہے دور کی

గోవాఁ నహీఁ పె వాఁకె నికాలేహుఏతో హైఁ
కాబేసే ఇన్ బుతోఁకోభి నిజ్బత్ హై దూర్‌కీ

ఇస్లాంమతం విస్తరించక పూర్వము, మక్కాలోని కాబాలో విగ్రహాలు ఉండేవట.

"కాబాలో అప్పుడు విగ్రహాలు లేక పోయినా. ఒకాలంలో కాబాయె విగ్రహాలన్నింటికి నిలయమై ఉండేది. ఈవాడు దేశంలో అన్ని చోట్లా కని పించే విగ్రహాలన్ని గూడా కాబా నుండి వచ్చిన వేకదా"

కవి ఈ పంక్తులలో మతసామరస్యాన్ని వెల్లడి చేస్తున్నాడు.

42 زندگی اپنی جب اس رنگ سے گزری غالب
ہم بھی کیا یاد کرینگے کہ خدار کہتے تھے

జిందగీ అప్నీజబ్ ఇస్ రంగ్‌సే గుజ్రీగాలిబ్
హమ్‌భీ క్యా యాద్‌కరేంగే కే ఖుదా రఖ్తే థే

కమనీయమైన, ఈ కవితలో గాలిబ్ తన జీవితాన్ని ఎంతో భావో పేతంగా చిత్రించినాడు.

"నా జీవితమంతా పేదరికంలో గడచిపోయింది. నేను ఎప్పుడూ బాధలనే అనుభవించ వలసివచ్చింది. ఇన్ని యిబ్బందులను అనుభవించి నప్పుడుగూడ నాపైన దయజూపగలవాడు భగవంతుడనే వాడొకడు లేడా అన్న ఆలోచన నాకెప్పుడూ రానే లేదు."

ఇదే భావాన్ని నిజాం అనే కవి తన గీతంలో ఈవిధంగా వ్యక్తపరచినాడు.

కిస్ కిస్ తర్హాసె హమ్‌కా సతాతేహైం బుత్‌నిజాం
హమ్ ఐసేహైంకె జైసె కిసీకా ఖుదానహో

ప్రేయసి, కాఠిన్యాన్ని గురించి మొరపెట్టుకుంటున్నాడు—నాకు అసలు భగవంతుడే లేనట్లుగా ఎంతో నిర్భయంగా ప్రేయసి నాపట్ల కాఠిన్యాన్ని చూపుతున్నది. దేవుడు తన ప్రజల రక్షకుడు. ప్రజలు గూడ భగవంతుని ఆర్తత్రాతగానమ్ముతుంటారు. నన్ను ఒంటరివాడననుకొని, దేవుడు నా పట్ల లేడనుకొని, ప్రేయసి యిష్టం వచ్చినట్టుగా దౌర్జన్యం జరుపుతున్నది. ప్రేమికుని వైపు నుంచి గూడ ఎవరో ఒకరు రాగలరు అన్న భయమేలేదు ఆమెకు.

43

بے در دیوار سا اک گھر بنایا چاہئے
کوئی ہمسایہ نہ ہو اور پاسباں کوئی نہ ہو

బేదరో దీవార్‌సా ఎక్ ఘర్ బనాయా చాహియే
కోయి హమ్ సాయనహో ఔర్ పాస్బాం కోయీనహో

గాలిబ్ కవి ఈ ప్రపంచాన్ని కేవలం ఒక పాంథశాలగా భావించేవాడు. ఇదే దృక్పథంతో అతను జీవితమంతా గడిపినాడు. ఈ దృక్పథమే మనకు ఈ పంక్తులలో స్పష్టమవుతున్నది:

"గోడలు, ద్వారాలు లేని ఒక ఇంటిని కట్టుకోవాలె ఆ ఇంటి ముందు ద్వారపాలకుడనేవాడు ఉండగూడదు. ఈ ఇంటికి ఇరుగుపొరుగూడ ఉండరాదు.''

ఇది గాలిబ్ ఊహాదృక్పథం.

44

منظر اک بلندی پر اور ہم بنا سکتے
عرش سے پرے ہوتا کاش کہ مکاں اپنا

మంజర్ ఏక్ బులందీ పర్ ఔర్ హాం బనాసక్తే
అర్శ్ సే పరేహోతా కాశ్‌కె మకాం అప్నా

ఇది గాలిబ్ భావశబలతకు ఒక చక్కని ఉదాహరణ.

లోకం ఆకాశాన్ని పరమదాన్ని ఒక సీమగా భావించి ఇక అవతల ఏమీ లేదని అనుకుంటుంది. నేనా సీమనుహద్దు అనుకోను నేనక్కడ ఇల్లు కట్టుకుని అక్కడ నుంచి కనిపించే దృశ్యాన్ని చూడాలని ఆకాంక్షిస్తున్నాను.

45

نہیں نگار کو الفت نہ ہو نگار تو ہے
روانیٔ روش و مستیٔ ادا کہیئے

నహీం నిగార్ కొ ఉల్ఫత్ నహో నిగార్ తొ హై
రవానియే రవిష్ వో మస్తియె అదా కహియే

ఆమెకు నా మీద ప్రేమ లేక పోవచ్చు. ఆమెను నేను పొందలేక పోవచ్చు. అందాలరాణి ఆమె సాక్షాత్కరించింది. ఇది చాలు ఒయ్యారాలు ఒలుకుతూ మనస్సును దోచుకుంటున్న ఆ సౌందర్య దర్శనమేచాలు.

46

رہا آباد عالم اہل ہمت کے نہ ہونے ہے
بھرے ہیں جسقدر جام و سبو میخانہ خالی ہے

రహా ఆబాద్ ఆలం అహ్లె హిమ్మత్ కె నహోనే సే
భరే హైఁ జిస్ ఖదర్ జామొసుబు మైఖానా ఖాలీ హై

సాహసోపేతులు ఉత్సాహవంతులు ముందుకు రాకపోవడంవల్ల ప్రకృతి సంపద మూల్గుతూ ఏడి ఉన్నది. నిరుపయోగంగాపడి ఉండేది ఐశ్వర్యం అనిపించుకోదు. సురాభాండాలు పండి ఉన్నా పానపాత్రికలు వేనవేలున్నా మదిరాస్వాదనం చేసేవాడెవడూ లేకపోతే సురాలయం ఖాళీగానే ఉండిపోతుంది.

47

ہوں گرمیٔ نشاطِ تصور سے نغمہ سنج
میں عندلیبِ گلشنِ نا آفریدہ ہوں

హూం గర్మియే నిషాతె తసవ్వుర్ పె నగ్మసంజ్
మైఁ అందలీబె గుల్షనె నాఆఫ్రీదా హూం

నేనొక కోయిలను. నా ఉద్యానవనం ఇంకా సృష్టికాలేదు. నా భావంలో మొగ్గతొడుగుతున్న ఆ ఉద్యానవనం నాలోపరవశత్వాన్ని కలిగిస్తున్నది. ఆనందోత్సాహాలను ప్రసరిస్తూ నేను పాడుతున్న ఈ సంగీతానికి ఉద్దీపనాన్ని కలిగిస్తున్నాదా కల్పనోద్యానమే.

తాను ద్రష్టనని, సమకాలీనులకంటె ముందు చూపుగలవాడని ధ్వని.

48 میں اور بزم مے سے یوں تشنہ کام آوں
گر میں نے کی تھی تو بہ ساقی کو کیا ہوا تھا

మైం ఔర్ బజ్మే మయ్‌సే యూంతిష్నకాం ఆవూం
గర్ మైంనే కీథీ తౌబాసాఖీకొ క్యాహువాథా

నేనిక సూరాపానం చేయబోనని శపథం చేసుకున్న మాట నిజమే. నేను మదిరాలయంలో ప్రవేశించాను. సాఖీ నన్ను చూసి తూష్ణీంభావం వహించింది. నాకు మదిర అందీయదు త్రాగనని శపథం చేసింది నేను సాఖీకేమైంది మరి? ఆమె మదిర నేల అందించదు? నేను పానం చేయకుండా ఆ మదిరాలయం నుంచి రావడం ఆమెకే సిగ్గుచేటు.

49 یہ لاش بے کفن اسد خستہ جاں کی ہے
حق مغفرت کرے عجب آزاد مرد تھا

ఏలాషే బేకఫన్ అసదేఖస్త జాంకిహై
హఖ్ మఘ్ఫిరత్ కరే అజబ్ ఆజాద్ మర్దథా

అసద్! (గాలిబ్) ఎంత స్వతంత్రుడు? ఎంతటి స్వాభిమాని? బ్రతుకంతా దారిద్ర్యంలోనే గడిచింది. చివరకు శవం మీద కప్పడానికి గుడ్డ కూడాలేదు. దైవం అతణ్ణి కరుణించాలె.

50 ہوئی مدت کہ غالب مر گیا پر یاد آتا ہے

وہ ہر اک بات پر کہنا کہ یوں ہوتا تو کیا ہوتا

హుంవీ ముద్దత్ కె గాలిబ్ మర్ గయా పరయాద్ ఆతాహై

వొ హర్ ఎక్ బాత్ పర్ కహెనా కె యూం హోతాతో క్యాహోతా.

ఆయనకెన్నో కోరికలుండేవి. మాటి మాటికాయన "ఈ కోరిక తీరి పోతే ఎంత బాగుండేది? ఎవరికేం నష్టం జరిగి ఉండేది?" అని తలపోస్తూ ఉండేవాడు. గాలిబ్ గతించి చాలా కాలంగడిచా, ఆయన ఈ నిర్భాగ్య జీవితం జ్ఞాపకానికి వస్తూవే ఉంటుంది.